



## గోవిందు గోవర్ధన్

| | |
|---|---|
| జననం : | 15-06-1969 |
| పితరులు: | శ్రీ గోవిందు సాయిలు, శ్రీమతి నారమ్మ |
| స్వగ్రామం: | పాలెము, నాగర్‌కర్నూల్ జిల్లా. |
| విద్య : | ఎం.ఏ., టి.పి.టి. (కేంద్రీయ విశ్వవిద్యాలయం) |
| వృత్తి : | అధ్యాపకత్వం (శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, పాలెము) |
| గురువులు : | శ్రీమతి ములుకుట్ల సరస్వతమ్మ, శ్రీ రామకృష్ణ శాస్త్రులు<br>డా॥ శ్రీ రంగాచార్యులు<br>డా॥ గోపాలకృష్ణారావు |
| పద్య గురువు : | డా॥ వెలుదండ సత్యనారాయణ |
| అభిరుచులు : | ఆధ్యాత్మిక చింతన, పద్యరచన |

గోవిందు గోవర్ధన్

పాలెము వేంకటేశ శతకము

# పాలెము వేంకటేశ శతకము



కృతికర్త

## గోవిందు గోవర్ధన్, ఎం.ఏ.,టి.పి.టి.

తెలుగు ఉపన్యాసకులు

శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల, పాలెము

పాలెము వేంకటేశ్వర ప్రచురణలు



**శ్రీ మట్టి జనార్దన్ రెడ్డి గారు ధర్మపత్ని శ్రీమతి జమున గారు**

**నాగర్‌కర్నూల్ శాసన సభ్యులు**

సీ॥ శ్రీలక్ష్మి నిలయుడై చిత్తమందున గర్వ మావగింజంతైన నందడెపుడు
సహధర్మచారిణి గృహలక్ష్మి జమునతో ధర్మ కార్యములందు తరలునెపుడు
ప్రజల ఇబ్బందులన్ పసిగట్టి శ్రద్ధగా సేవకై నిలిచెను చిత్తగించి
పేదింటి చెల్లెల్ల పెద్దన్న ఏటేట వైవాహములు జర్పె వైభవముగ

తే॥ వినుతికెక్కిన పాలెము వేంకటేశు
శతకముద్రణ కోరగా స్వాగతించి
ద్రవ్యమందించె తృప్తిగా దానశీలి
మట్టి వంశాబ్ది శేఖరున్ మరువమెపుడు



## మేము మా అమ్మ నాన్నలు

సీ॥ కొండమ్మ శ్రీనివాస్ గోవర్ధనికరాము
పురుషోత్తమీశ్వర పొందికగను
నారమ్మ సాయిలు నామధేయులపేగు
బంధమై యుంటిమి పల్లెయందు
ఆర్థిక స్థితి చూడనరకొరగానున్న
నున్నత చదువులన్ పొందజేసి
పరుల నాశింపక వెరువక తగినట్లు
జీవిక నొసగిరి శ్రేష్ఠముగను

తే॥ వేంకటేశుని పాదాలు విశ్వసించి
ఆటుపోటులునెదురైన నదురకుండ
స్వామి సేవకై నిలిపిరి శాశ్వతముగ
స్మరణ చేతుము తృప్తిగా మరువకెపుడు.



## డా॥ కె.వి.రమణాచారి గారు ఐ.ఏ.ఎస్. (రి)

### ప్రభుత్వ సాంస్కృతిక సలహాదారులు, తెలంగాణ రాష్ట్రం

సీ॥ భరత వర్షమునందు పాలనాసేవలో విజ్ఞానమును పంచి వెలిగిపోయె
తిరుమలేశునిచేరి దివిజులెల్లరుమెచ్చ ధార్మికతను చాటి ధన్యుడయ్యె
పాలనాసూత్రాల నేలికల్ ముదమొంద సలహాలనందించు సజ్జనుండు
దరహాస వదనుడై దరిచేరి కళలను నభివృద్ధినొందించు నవనిసురుడు

తే॥ విమల చరితుడు సుబ్బయ్య విప్రవరుని
వినుతికెక్కిన పాలెము వేంకటేశ
శతకమావిష్కరింపను సాగివచ్చె
మాన్య శ్రీ కె వి రమణార్య మమతతోడ




**శ్రీమతి ఎ.వాణి ప్రసాద్ గారు** ఐ.ఏ.ఎస్.

**ఉన్నత విద్యా సంచాలకులు, తెలంగాణ రాష్ట్రం**

సీ॥ తెలగాణ కీర్తి దేదీప్యమౌ విజ్ఞాన కాంతులన్ వెదజల్ల కదలుచుండె
విశ్రాంతి విడనాడి విజ్ఞాన కేంద్రాల నభివృద్ధి నొందింప నండనిలిచె
ఉన్నత విద్యల నౌన్నత్యముగ మార్పు చెందించె నత్యంత చేరువయ్యి
ఏకసంతాగ్రాహి ఏళ్ళనాటి స్మృతుల్ చక్కగా గుర్తించు శక్తి కలది

తే॥ తగిన సమయమందతిథులన్ దరికి చేర్చి
సరిగ చిరునవ్వు మోముపై సంతరించి
తనరు సలహాల నందించి తప్పకుండ
సాగు చాలకుల్ వాణిప్రసాదుగారు.



**డా॥ గోపాలకృష్ణరావు గారు,**

విశ్రాంత ప్రధానాచార్యులు, గణిత శాస్త్రం.

సీ॥ గణిత శాస్త్రమునందు కఠిన సమస్యలన్ విడమర్చి బోధించి వినుతికెక్కె
అజ్ఞానులెల్లరన్ ప్రజ్ఞానులుగ మార్చి పట్టభద్రులజేసి పంపుచుండె
పరమ హంసనుబోలి ధర నిరాడంబరం విజ్ఞానమూర్తియై వెలుగుచుండె
ఆచార్యులందరన్ పూజార్హుడై నిల్చి సార్థక జన్ముడై సాగుచుండె

సరిగ విద్యార్థి ముడిరాళ్ళ సానబట్టి
శ్రేష్ఠ శిల్పాలుగా మల్చె నిష్ఠతోడ
శిష్య హృదయాంతరాలాన చేరినిలిచె
సదయగోపాలకృష్ణార్య సజ్జనుండు



**డా॥ వెలుదండ సత్యనారాయణ గారు**
**విశ్రాంత ప్రధానాచార్యులు**

సీ॥ సౌమ్యుడౌ వెలుదండ సత్యనారాయణ సత్కీర్తివంతుడై సాగుచుండె
అధ్యాపకులతోడ నౌన్నత్యముగమెల్గి విద్యాలయాలను వెలుగజేసె
కవికుమారుల గాంచి కలములన్ పట్టించి ఉత్సాహమును నింపి యున్నతముగ
శతకాలు రచియింప సతతము వెన్నంటి మెలకువల్ నేర్పించె మేటి గురుడు

తే॥ పద్య కృతులకై యువతను ప్రోత్సహించి
ఓనమాలను దిద్దించి యోపికగను
సాగి సాహితీ సేవకై స్వాగతించి
భక్తి శతకాలనల్లించె యుక్తితోడ



## సుబ్బయ్యగారి మిత్ర బృందము

సీ॥ గ్రామాభివృద్ధికై గౌరవ సుబ్బయ్య దూరదృష్టి మదిని తొలచుచుండ
బాలకృష్ణారెడ్డి బాల లింగయ్యలు శ్రీకిషన్ హనుమప్ప చేరి రొప్పి
బుర్రి సింహారెడ్డి బుర్రి కొండారెడ్డి మరి పరంధాములు మసలిరికను
గ్రామ పట్వారి నారాయణా నాటి స ర్పంచి యౌవేంకట రామిరెడ్డి

తే॥ మిత్రులెల్లరు నైక్యమై విప్రవరుని,
పూని త్రికరణ శుద్ధిగా ప్రోత్సహింప
నిలిపె శాశ్వత వనరులన్ నిండుగాను,
వెలిగె కుగ్రామ మానాడు విశ్వమంత

## అప్పటి అమెరికా అధ్యక్షుడైన శ్రీ రోనాల్డ్ రీగన్ గారు పంపిన ప్రశంసాపత్రం



THE WHITE HOUSE
WASHINGTON

April 8, 1980

Dear Subhrahmanyam,

On behalf of the National Science Foundation of U.S.A. and my self I thank you for the co-operation extended to the American Scientists of National Foundation under leadership of Dr. Jac Street and Dr. Lee Lacy who visited Palem, India to study the Solar Eclipse of Feb. 16, 1980.

Sincerely

Ronald Reagan
RONALD REAGAN

NATIONAL • SCIENCE • FOUNDATION

# National Science Foundation

This Certificate is Presented to

*T. Rameswar Sarma*

in recognition of important contributions
to the success of the February 16, 1980
National Science Foundation Solar Eclipse
Programs in India

1980 SOLAR ECLIPSE

Richard C. Atkinson

Richard C. Atkinson, Director
National Science Foundation



శ్రీ గణనాయక నిత్యము
సాగిలబడి వేడుచుంటి సంతోషముగా
సాగించుము ఘన శతకము
నాగక విఘ్నంబులన్ని యనచియు దేవా!

| | |
|---|---|
| పుస్తకం పేరు | : పాలెము వేంకటేశ శతకము |
| కృతికర్త | : గోవిందు గోవర్ధన్ |
| ప్రథమ ముద్రణ | : 2017 |
| ప్రతులు | : 1000 |
| హక్కులు | : కృతికర్తవి |
| ప్రతులకు | : శ్రీ గోవిందు గోవర్ధన్<br>తెలుగు ఉపన్యాసకులు, శ్రీవేంకటేశ్వర ప్రభుత్వ ఓరియంటల్ కళాశాల, పాలెం, నాగర్‌కర్నూల్ జిల్లా. తెలంగాణ రాష్ట్రం. పిన్‌కోడ్: 509215<br>ఫోన్: 8106384812 |
| ప్రచురణ | : 1.<br>పాలెము వేంకటేశ్వర ప్రచురణలు |
| వెల | : రూ॥ 100/- |
| అక్షరాకృతి ముద్రణ | : సువర్ణ ప్రింటర్స్,<br>విద్యానగర్, హైదరాబాద్-44<br>ఫోన్: 8978884678 |

## పాలెము వేంకటేశ శతకము
## విషయ సూచిక



### శతక పద్యాలు



# మంగళాశాసనములు

శ్రీ వేంకటేశ్వర స్వామి పాలెము గ్రామములో భక్తులకు అందించుచున్న ఆశీస్సులు, మనందరిపైన యుండాలని శ్రీవారిని మనసారా ప్రార్థించుచున్నాను.

పాలెము సుబ్బయ్య గారి గ్రామ సేవను, ఆయన సాధించిన ప్రజోపయోగపనులను, ప్రస్తుత జనం చిరకాలము గుర్తించుకొనుటకు, తరువాతి తరాలకు తెలియజెప్పాల్సిన బాధ్యతను, తన భుజస్కంధాల పైనుంచుకొని, శ్రీ గోవిందు గోవర్ధన్, తెలుగు ఉపన్యాసకులు, ప్రాచ్య కళాశాల, పాలెం, పాలెము వేంకటేశ శతకమును రచించినందులకు చాలా సంతోషము. నా అభినందనలు.

శ్రీ సుబ్బయ్య గారు తన యావత్ జీవితాన్ని ఈ పాలెము గ్రామ వికాసానికి అంకితం చేసిన మహనీయుడు. తన కోసం తన కుటుంబంకోసం బతకడమే మానవ లక్షణము కాదనే వారు. తనతోబాటు ఇతరులు కూడా బతకాలి. అందుకు అవసరమైన పనులను చేయాలి అని అనేవారు. ఉన్నతాశయంతో చేసిన పనులు, సత్కర్మలవుతాయని అవి ఇహపరాలకు దారి చూపుతాయని ఆయన చెప్పిన మాటలు ఆ పనులు చేసేవారిని అందరు ఆత్మీయంగా చూస్తారనేవారు. చిరకాలం జ్ఞాపకంగా మిగిలిపోవాలంటే, జనం గుర్తించుకోదగ్గ పుస్తకాలనైన రాయాలి, లేదా పుస్తకాలు రాయదగ్గ పనులనైనా సాధించాలి. కావున సుబ్బయ్య గారు రాయదగ్గ పనులెన్నో చేసి పెట్టారు.

ఈ శతకము త్వరలో అందరికి అందాలని ఆకాంక్షిస్తున్నాను.

– **శ్రీ తోటపల్లి రామేశ్వర శర్మ,** పాలెం



# గోవర్ధనోద్ధరణము

ఎవ్వాని భక్తికి నీ చిన్నిపల్లెలో  వేంకట రమణుండు వెలసినాడు
ఎవ్వాని కృషితోడ నీ పల్లె జాతరై 'దేవుని పాలెమై' తేజరిల్లె
ఎవ్వాని చారిత్ర మెల్లరున్ శ్లాఘించి 'కారణజన్ముడై తీరు' ననిరి
ఎవ్వాని ప్రేమ సాయీశ్వరాది ప్రముఖల్ పాదాలు మోపిరి పల్లెలోన

అతడు మాన్యుండు, 'తోటప'ల్లన్వయుండు
అతడనఘుడు, 'సుబ్రహ్మణ్య' మనెడు ఘనుడు
పాలమూరు మండలమందు ప్రథితుడతడు
పుణ్యుడును, కర్మ యోగియు, భూమి సురుడు

సూతుడు శౌనకాది మహామునుల కిట్లు ప్రవచించెనని పురాణములు సమారంభ మగును. అనగా నొక పౌరాణికుడు మహామునులకు చెప్పు చున్నాడని తాత్పర్యము.

పై విధముగా భగవంతుని కథలు భక్తులకు చెప్పుట సర్వ సామాన్యము, కాని ప్రస్తుత శతకమునందొక భక్తుని గొప్పతనము భగవంతునికి నివేదించుకొనుచున్నాడీ కవి కుమారుడు. ఇటులీ 'పాలెము వేంకటేశ' శతకము కొత్త పుంతలు తొక్కినదనియే చెప్పవలె.

ఒక వ్యక్తిపరమైన జీవిత విశేషములు ప్రతిబింబించు నిటువంటి శతకములు మనకు నతి తక్కువే! కనుక నిదియు నొక విశేషము. శ్రీ వేంకటేశ్వరున కంకితమైనందున నిదియొక భక్తి శతకమగుచున్నది. అంతియగాక ఇతివృత్తమును బట్టి యిది యొక సామాజికాంశమునకు, సంపూర్ణ సూర్యగ్రహణము వంటి చారిత్రక విశేషములకు తావలమైన శతకమగుచున్నది. ఇది యింకొక విశేషము.

## కారణజన్ముడు

ఒక సామాన్య భారత పౌరుడు తలుచుకొన్నచో తన గ్రామమునెంత గొప్పగా తీర్చిదిద్దుకొనగలడో కీర్తి శేషులు తోటపల్లి సుబ్రహ్మణ్యము (సుబ్బయ్య) గారి జీవితమునొకసారి పరిశీలించిననర్థమగును. దేశ సేవ చేయుదుమని జబ్బలు చరుచుకొను రాజకీయనాయకులొక్కక్కరు తమతమ గ్రామముల నొక్కక్కదానిని సుబ్బయ్యగారివలె తీర్చిదిద్దుకొనగలిగిన గొప్ప విశేషమేయగునుగదా! అటుల దిద్దుకొనగలిగిరా! గుండెలమీద చేయివేసి చెప్పగలిగినవారెందరు? వారందరూ సుబ్బయ్యగారిని చూసి సిగ్గిల్లవలె.

సుబ్బయ్యగారు దేశమంతటి నుద్ధరింతునని బయలుదేరలేదు.

రాజకీయనాయకుడు కావలెననుకొనలేదు. తన గ్రామమున తానున్నాడు. పదిమంది రాజకీయనాయకలు చేయలేని పని తానొక్కడే చేసి చూపించాడు.

అదియు ప్రభుత్వము నందధికారపక్షమునకు చెందిన మంత్రి కాదు. ఎంపీ కాదు, ఎమ్మెల్యే కాదు. ఆయూరి సర్పంచైనను కాదు. వార్డు మెంబరైనను కానేకాదు. మనవంటి మామూలు పౌరుడే అయి యుండియూ మన యూహకందనన్ని సాధించకలిగినాడు. అంతేకాక జిల్లా కలెక్టరువంటి యొక ఉన్నతోద్యోగియా? లేదేని యొక గొప్ప వ్యాపారరంగ నిష్ణాతుడాయన్న కాదనియే సమాధానం.

అతడొక మనిషి – అంతే! మనుషులలో మనిషి – మంచి మనిషి. మానవత్వమున్న మనిషి. అందుకే అతడొక మనీషి – గుర్తించదలచుకొన్న నాతడొక కారణజన్ముడు. ఇదియొక కోణము.

కారణజన్ముడని నిర్ధారించుటకు మరియొక కోణమున్నది. ఆంజనేయ స్వామి సముద్రము లంఘించినాడు. అతనికంటే ముందు సముద్రమును లంఘించినవారెవరునూ కనిపించరు. అతని తరువాత నేటివరకు నెవరునూ లేరు. ఒకే ఒక్కడు ఆంజనేయుడు. అందులకే అతడు కారణజన్ముడైనాడు.

అటులనే సుబ్బయ్యగారికంటె ముందు పాలెము గ్రామమున వారియంతటి వ్యక్తి మరొకరు జన్మించి యుండలేరు. వారు పరమపదించిన తదనంతరము నేటి వరకునూ అంతటి మహానుభావుడుద్భవించనేలేదు. కాబట్టి యతడొక కారణజన్ముడు. ఇది నిస్సందేహము.

## విజయరహస్యము

అంతేకాక పాలమూరు జిల్లాలోనున్న యనేక గ్రామములలోనూ తన గ్రామమును తానీతీరుగా దిద్దుకొనజాలిన సామాన్యుడు సుబ్బయ్య గారి తరువాత మరియొకడు కనిపించడు.

దానికి ప్రధాన కారణం దైవానుగ్రహం (నేటి నాయకులనేకులకు చాలనిదిదే!) తర్వాతి కారణము పురుషకారము. అనగా మానవ ప్రయత్నము. సుబ్బయ్యగారు దేవునిమీద భారము వేసి నిష్క్రియత్వ మవలంబించి చేతులు ముడుచుకొని కూర్చొనలేదు. తన ప్రయత్నము తాను నిరవధికముగా శక్తివంచనలేకుండ కొనసాగించినాడు! అంతే!

దేవుని ప్రసక్తిలేకుండా చేయగలననుకొనలేదు. దేవుడే చేసుకొనునులే! అనుకొనలేదు. ఒక్కమాటలోనిదియాయన విజయరహస్యము. ఈ విధముగా కర్మయే యోగముగా మలచుకొనియాయన ఒక కర్మయోగి యగుచున్నాడు.

తమ స్వగ్రామములను తాము దిద్దుకొనక దేశమంతటి నుద్ధరింతుమని చాటింపువేయించుకొను నాయకులు సర్వసామాన్యులైన సుబ్బయ్యగారిని చూసి తలలు వంచుకొనవలసినదే కదా!

## త్రికరణములు

ఆయనగావించినయభివృద్ధి పనుల నేకరువుపెట్టుట నాయుద్దేశ్యము కాదు. అవి ఈ పొత్తమునందుండనే యున్నవి. తాత్వికమైన కొన్ని ముఖ్యాంశ ములను పేర్కొని ముగింతును.

దేవుడు జీవులకు ప్రసాదించినవి మనోవాక్కాయములు. ఇవే త్రికరణములు. త్రికరణశుద్ధిగా దేవుని విశ్వసించిన సుబ్బయ్యగారిది గ్రహించినారు. మనసును, పరివర్తనము చెందించునది విద్య- కాయమనగా శరీరము నారోగ్యముగా నుంచునది వైద్యము. సుబ్బయ్యగారు సంకల్పించగానే దైవానుగ్రహముతోడై విద్యాలయములు, వైద్యాలయములు చకచక సాకారరూపములందినవి. అట్లే వాక్కును పరిశుద్ధమొనరించుటకై వాఙ్మ యమును లేదా సాహిత్యమునధ్యయనము చేయించుటకై ప్రాచ్య కళాశాల రూపుదిద్దుకొన్నది.

నేడు నాయకుల పేర్లు జిల్లాలకు గ్రామాలకు పెట్టుట చూచుచున్నాము. సుబ్బయ్యగారానాడు తలచుకొన్నచో తనయూరికి తన పేరు పెట్టుకొనుటకడ్డుచెప్పు వారెవ్వరునూ లేకుండిరి. ఇప్పుడీగ్రామము 'సుబ్బయ్యగారి పాలెము' అని పిలవబడెడిదేమో! కాని అటువంటి కీర్తికండూతి ఆయనకు లేదు. దైవ సమర్పణ బుద్ధితోనామహానుభావుడు గ్రామాభ్యుదయము కాంక్షించినవాడగుటంజేసి నేడు పాలెమునకు తలవని తలంపుగా దేవుని పాలెము అనెడి మరొక సార్థక నామధేయమేర్పడినది.

## దేవునిపాలెము

మహబూబ్‌నగర్ జిల్లాలో పాలెము పేరిట రెండు గ్రామములున్నవి. ఇదెఱింగినవారు 'పాలెము' అనగానే ఏ పాలెము? అని యడుగుట పరిపాటి. అప్పుడు 'దేవుని పాలెము' లేదా కొత్తకోట పాలెము అని సమాధానము వినిపించును.

'దేవుని పాలెమ'నగా దేవుడు వెలసిన పాలెము, లేదా శ్రీవేంకటేశ్వర దేవస్థానము విరాజిల్లు పాలెము. 'కొత్తకోట పాలెము' అనగా హైదరాబాద్ కర్నూలు జాతీయ రహదారిమీద కొత్తకోట సమీపముననున్న పాలెము.

మొత్తముమీద సుబ్బయ్యగారి పుణ్యమున నీపాలెము దేవుని పాలెమైనది. అనగా నీ గ్రామమే దేవునిది. మనుషులది కాదు. గ్రామమునందు దేవస్థానము కాదు. గ్రామమంతయూ దేవస్థానమే. గ్రామమందెచటనున్నను దేవాలయమున నున్నట్లే భావించవలె. గ్రామమే దేవునిది. గుడి యొకటే కాదు. దేవుని పాలెమందున్న రహస్యార్థమిది సుమా!

## నివేదనము

అటువంటి దేవుని పాలెమందు వెలసిన దేవుని గురించి తోటపల్లి సుబ్రహ్మణ్యముగారికెవరెప్పుడు వివరించి చెప్పిరోగాని సుబ్రహ్మణ్యముగారి లోకోత్తరములైన గ్రామ సేవలగురించి ఆ దేవునికి అనగా వేంకటేశ్వరస్వామికి మాత్రము గోవిందు గోవర్ధన నామాధేయుడైన కవి కుమారుడీనాడీశతకము నందు సవివరముగా నభివర్ణించి నివేదించి 'అయ్యారే!' యనిపించు కొనుచున్నాడు.

ఇయ్యది పాలెము కళాశాల పూర్వవిద్యార్థులమైన మాబోంట్లకు నత్యంతహర్షదాయకమైన విషయమే! పాలెము గ్రామవాసియైన గోవర్ధన కవికిది తొలి కృతి. సుబ్బయ్యగారి సేవాకార్యములన్నిటిని తమ గ్రామ దైవతమైన వేంకటేశ్వరస్వామికి నివేదించినాడు. ఈ కవి తా రచించిన తొలి కవనమును స్వామికి సమర్పించినాడు.

గ్రామ ప్రజలకు దైవసమానుడైన సుబ్బయ్యగారి గురించి గ్రామములోని దైవమునకే కవి నివేదించుట ఇచట గమనించదగినది.

## గోవర్ధన పర్వతము

సుబ్బయ్యగారు వేంకటేశ్వర స్వామి భక్తులుగావున వేంకటేశ్వర దేవస్థానమును నెలకొల్పినారు. వారాదర్శపురుషులుగావున 'ఆదర్శ పాఠశాల'నెలకొల్పారు. వ్యవసాయదారుడు, గావున వ్యవసాయ విశ్వ విద్యాలయమునారంభింప జేసినారు. ఇట్లే యెన్నో ! అయినా ఆయన యే ఒక్కసంస్థకును తన పేరు పెట్టుకొనలేదు. ఆయన తరలిపోయిన తరువాత ఆదర్శపాఠశాలను టి.ఎస్. మెమోరియల్ స్కూల్ (తోటపల్లి సుబ్రహ్మణ్యము స్మారక పాఠశాల) గా మార్చినారు.

ఈ విధముగా సుబ్బయ్యగారు సామాన్యులే, గాని ఆయన గావించిన గ్రామసేవ మాత్రము అసామాన్యమైనది, అనూహ్యమైనది, అనల్పమైనది, గంభీరమైనది. అది ఒక గోవర్ధన పర్వతమే! అటువంటిదానిగురించి ఇప్పుడిప్పుడే పద్యములల్లుటకు పూనుకొని తప్పటడుగులు వేయుచున్న గోవర్ధనకవికుమారుడు అభివర్ణించగలడా! అన్నచో గోవర్ధనోద్ధరణ ఘట్టమునందలి భాగవత పద్యమొకటి స్ఫురింపకమానదు.

**"బాలుండీతడు కొండదొడ్డది, మహాభారంబు సైరింపగా జాలండో....** అన్నదాపద్యము కానీ యొక విషయము విస్మరించరాదు. అదే మన సుబ్బయ్యగారు వెంకటేశ్వరునికి కార్య సమర్పణము గావించినటులే ఈ కవి కవన సమర్పణము గావించినాడు. ఇరువురియందు సమర్పణ భావమొకటే! దానివలన యలనాడు సుబ్బయ్యగారు సార్థకజీవనులైనారు. కాబట్టి దానివలననే ఈనాడు గోవర్ధన కవియు సార్థక జీవనుడే కాబోవు చున్నాడని తేటతెల్లమగుచున్నది.

## గోవర్ధనకవి

చి॥ గోవర్ధన కవియొక యధ్యాపకుడు – నూటికి తొంబదిమంది యధ్యాపకులీ నాడధ్యయనమును విస్మరించినారు. అందుకు కారణ మధ్యాపనమునొక వృత్తిగా మాత్రమే భావించుట. ప్రవృత్తిగా దర్శించు నధ్యాపకులు మాత్రమే నేడధ్యయనము కొనసాగించు చున్నారనుట లెస్స!

వృత్తిగా మొదలైన సాహిత్యమును చిరంజీవి గోవర్ధనుడిపుడు ప్రవృత్తిగాకూడా స్వీకరించుట శుభసూచకము. నాదృష్టిలో సాహిత్యా ధ్యాపకులకిది యాదర్శముకూడా. అందుకని ఈ కవికుమారుని నేను మనసారా అభినందించుచున్నాను.

చిరంజీవి గోవర్ధన్ జిజ్ఞాసువు, నిగర్వి, వినయశీలి, శ్రద్ధాళువు వర్ధిష్ణువుల కుండవలసిన యర్హతలన్నియు నీతనికున్నవి. మచ్చలో చందమామను చూచు దృష్టిదోషము మనకు లేనప్పుడు చందమామలో మచ్చ కంటబడినను మన్నింతుముగదా!

గతములో మాన్యశ్రీ కపిలవాయి లింగమూర్తి గారు! "సుబ్రహ్మణ్యో దాహరణమును" శ్రీ ఇమ్మడిశెట్టి చంద్రయ్యగారు "పాలెము వెంకటేశ్వర శతకము" ను విరచించినారు. నా పర్యవేక్షణలో చిరంజీవి రేణుబాబు మహబూబ్‌నగర్ జిల్లా తెలుగు సాహిత్యమున పాలెము గ్రామ ప్రశస్తి యను పేర చక్కని పరిశోధన కావించి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి యం.ఫిల్.పట్టా పుచ్చుకున్నారు.

## ఆకాంక్ష

చిరంజీవి గోవర్ధన్ అంచెలంచెలుగా యెదిగి సరససాహితీ సరోవరపు లోతులు చూడగలిగి యలవోకగా నీదులాడు గజ యీతగాడు కావలెనని, విద్యార్థులకు బోధించుట కోసమే తప్ప తాము స్వయముగా రచించుటకై పద్య లక్షణములను నేర్చుకొననోపని తెలుగు పండితులున్న యాధునిక యుగమున వారందరికినీ చిరంజీవి గోవర్ధన్ మార్గదర్శకుడు కావలెనని, గ్రామాభివృద్ధితోపాటు శ్రీ వేంకటేశ్వర సాన్నిధ్యమును సైతము పొంది యైహికాముష్మికములను సాధించుకొనగలిగిన శ్రీ సుబ్బయ్యగారి మాదిరి కవిత్వ సాధనతోబాటు భగవదనుగ్రహమును సాధించుకొను దిశలో చి॥గోవర్ధన్ సాగవలెనని, యాతని లేఖిని నుండి భక్తిరస పునీతములైన మరికొన్ని కృతులు చూడవలెనని యాకాంక్షించుచు, అందులకై శ్రీ పాలెము వేంకటేశ్వరస్వామిని ప్రార్థించుచు సెలవు గైకొనుచున్నాడను.

సర్వం శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు.
శ్రీ వేంకటేశ్వర భక్తపరమాణువు

**వెలుండ సత్యనారాయణ**
విశ్రాంత ప్రధానాచార్యులు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నాగర్‌కర్నూల్,

తేది: 23.12.2014
విజయపురి కాలని,
హైదరాబాద్.



## విద్యావాచస్పతి వేదశ్రీ విద్వచ్ఛిరోమణి

# ఆశీస్సులు

చి॥ గోవిందు గోవర్ధనుడు అను ఈ కవికుమారుడు మున్ముందు చాలా గొప్పకవిగా ఎదగగలడు. ప్రస్తుతము మొదటి ప్రయత్నములోనే పాలెమును అభివృద్ధిపరిచిన బ్రహ్మశ్రీ తోటపల్లి సుబ్రహ్మణ్య శర్మగారి కృషిని సవివరముగా క్రమబద్ధముగా పద్య శతకములో బంధించెను. ఈ పద్యములన్నియూ సీస పద్యములు. ప్రతి పద్యము చివర "ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ వినుతు గావింతు పాలెము వేంకటేశ!" అను మకుటముతో వ్రాసిరి. ఈ చిరంజీవి కవిత్వము ధారాళముగా, ధారాశుద్ధితో సమానముగా సాగినవి. అంత సమానముగా అన్ని పద్యములను వ్రాయుట సామాన్య విషయము కాదు. ఇతనియందు పాలెము వేంకటేశ్వర స్వామి కృపయేగాక ఉపాధ్యాయుల శుభాశంసనలన్నియు బాగుగా పని చేసినవని తలంచవచ్చును.

గురుభక్తి ఎంతటి విజ్ఞానమునైనను ప్రసాదించును. ఈ చిరంజీవిలోని గురుభక్తియే ఇంతటి గొప్పవాడుగా ఎదుగుటకు దోహదము చేసినది.

మున్ముందు ఈ చిరంజీవినుండి చాలా మంచి కవిత్వమునకై సమాజము ఎదురుచూచుచున్నది.

సరస్వత్యేవైషా ఘటయతి యధేష్టం భగవతీ
ఇతోధిక ధర్మాచరణ శ్రద్ధాభిలాష కలగవలెనని ఆశించు

**బ్రహ్మశ్రీ తెలకపల్లె విశ్వనాథశర్మ**
యం.ఏ.,
విశ్రాంత ప్రధానాచార్యులు, పాలెము.

11-13-454/1, రోడ్ నెం.14,
అలకాపురి, హైదరాబాద్.
ఫోన్: 9494872432



## సహృదయ స్పందన

**ఆది రాజ యశోబింబ మాదర్శం ప్రాప్యవాఙ్మయమ్ ।**
**తేషామ సన్నిధానేపి నస్వయం పశ్యనశ్యతి ॥**

అని పూర్వ పండిత వచనము.

పూర్వకాలపు మహారాజుల కీర్తి అనే బింబము వాఙ్మయమనే విశిష్టమైన అద్దంలో ప్రతిబింబించింది. అయితే ఈ అద్దం యొక్క విశిష్టతవల్ల ఆ రాజులు లేకపోయినా వారి కీర్తి మాత్రం శాశ్వతమై నేటికీ తెలియబడుతూ ఉంది. అని పై శ్లోకం యొక్క భావం.

కవికి కావ్య వస్తువుగా పుణ్యశ్లోకుడైన వ్యక్తి చరిత్ర లభించడం అదృష్టం. శ్రీ రాముని చరిత్ర వ్రాసిన వాల్మీకి మహర్షి చిరస్మరణీయుడగుట ఇందుకు తార్కాణం. అట్లే అటువంటి కవిచేత కీర్తింపబడుటచే ఆ మహామహుని కీర్తికి శాశ్వతత్వం లభించింది. అందుకే **'మణినా వలయః వలయేన మణిః'** (మణిని పొదగడంవల్ల కంకణానికి, కంకణంలో పొదగబడటంవల్ల మణికి అందం ఇనుమడిస్తుందని భావం) అంటారు.

ప్రస్తుత కవి శ్రీ గోవిందు గోవర్ధన్ రచించిన పాలెము వేంకటేశ శతకము ఆ విధమైన అదృష్టానికి నోచుకొన్నదని భావిస్తున్నాను.

'పాలెము' అనే కుగ్రామాన్ని తన నిరంతర కృషితో, త్యాగంతో, సాహసంతో, చాతుర్యంతో పట్టణస్థాయికి ఎదిగించిన శ్రీ తోటపల్లి సుబ్రహ్మణ్యం గారి జీవితములోని ముఖ్య ఘట్టాలను అంటే పాలెం క్రమాభివృద్ధిని ఉన్నదున్నట్లుగా అతిశయోక్తులతో కలుషితం చేయకుండా సంక్షిప్త సుందరంగా కన్నులకు కట్టించడం ఈ శతక వైశిష్ట్యం.

చక్కని సీస పద్యాలతో సాగిన ఈ శతకంలో లక్షణ దోషాలుగానీ, భాషా దోషాలు గానీ లేవు. భావనా పటిమ, వర్ణనా నైపుణ్యం ప్రతిపద్యంలోనూ తొనికిసలాడుతున్నవి. వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాల వర్ణన (33 వ పద్యం నుండి 39వ పద్యం వరకు) దసరా దీపావళి మున్నగు పండుగల దృశ్యాలు (45వ పద్యం మొదలు 48వ పద్యం వరకు) మొదలగు చోట్ల ఈ గుణములను దర్శించవచ్చు. సుబ్బయ్యగారిని మరలా జన్మించగోరుటలో రసపుష్టిని (127వ పద్యం) చూడవచ్చు.

41వ పద్యంలో అందంగా సాగిన సావయవ రూపకాలంకారము. 109 వ పద్యంలో సూర్యగ్రహణ రూపంలో ప్రపంచాన్ని ఆకర్షించిన సూర్యుని రాకకు కారణములను ఊహించిన హేతూత్ప్రేక్షాలంకారము, 111, 34, 45, 46 పద్యాలలో కనిపించే స్వభావోక్త్యలంకారాలు. 119వ పద్యంలో సుబ్బయ్యగారిని వివిధ రూపాల్లో ఉల్లేఖించే ఉల్లేఖాలంకారము కవికిగల అలంకార ప్రయోగచాతుర్యాన్ని ప్రదర్శించే కొన్ని ఉదాహరణలు. సాహితీపరులు మరి కొన్నిటిని గుర్తించి హర్షించగలరని ఆశిస్తున్నాను.

ఫలశృతిలో చెప్పినట్లు ఈ శతక పఠన శ్రవణమననాదులు వ్యక్తిలో ఉన్నతభావములు కలిగించుననుటలో సందియమావయంతయు లేదు.

సహృదయులీశతకమును శ్రద్ధతో పఠించి పాలెము సుబ్బయ్యగారి ఘనకీర్తిని, పాలెము గ్రామాభివృద్ధిని మనసులో దర్శించి శ్రీ వేంకటేశ్వరస్వామి మహిమను అనుభవించి స్వామి కృపకు పాత్రులగుదురుగాక అని విన్నవిస్తున్నాను.

నేను 1965 జులై నెలనుండి 1971 అక్టోబర్ వరకు పాలెము ప్రాచ్య కళాశాలలో ఉపన్యాసకునిగా పనిచేసియుంటిని. ఆ మధ్యకాలములో జరిగిన వైభవమునకంతటికిని ప్రత్యక్షసాక్షిని. ఆ దినములలోని ఆనందానుభూతి నేటికీ మనస్సులో చెరగని ముద్రయై నిలిచి యున్నదని మనవిచేస్తూ సెలవు తీసుకొనుచున్నాను.

ఇంతటి సత్కార్యమును పూని నెరవేర్చి తన కృతజ్ఞతను చాటుకొన్న సత్కవి శ్రీ గోవిందు గోవర్ధన్ గారికి ఇతోధికశ్రేయః ప్రాప్తి కలుగవలెనని కోరుతూ అభినందిస్తున్నాను.

ఇట్లు,

సుధీవిధేయుడు,

**వింజమూరి శేషఫణిశర్మ,**

పూర్వ ఆంధ్రోపన్యాసకులు,

శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, పాలెం.

15-3-2016,

పుట్టపర్తి.



# పండితాభిప్రాయము

శ్లో॥ ప్రబంధానాం ప్రబంధౄణాం అపికీర్తి ప్రతిష్ఠయోః।
మూలం విషయ భూతస్యనేతుర్గుణ నిరూపణమ్॥

"ఉత్తమ నాయకుని సహజ సద్గుణ ప్రఖ్యాపనము వలన కవికిని, కావ్యమునకును సుస్థిర కీర్తి ప్రతిష్ఠలబ్బును" అని అలంకారిక ప్రకాండుడైన కాకతీయ ప్రతాప రుద్ర మహారాజాస్థాన పండితాగ్రగణ్య శ్రీశ్రీశ్రీ విద్యానాథ కవి మూర్ధన్యుని యభిమతము.

ఈ యువ కవి శ్రీయుత గోవిందు గోవర్ధను గారు ప్రాచీన కోవిద సంప్రదాయాను రూపముగ పాలెము తోటపల్లి(సుబ్రహ్మణ్యం) సుబ్బయ్య మహనీయుని తమ "పాలెము వేంకటేశ శతకము"నకు కథానాయకునిగా నెన్నుకొనుట యెంతయుసముచితము.

శ్రీ సుబ్బయ్యగారు ధనికవర్గములో గాని, పండిత వర్గములో గాని, ఆధునిక రాజకీయ నాయక వర్గములో గాని చేరిన వాడు కాదు. సామాన్య కుటుంబమునకు చెందిన పురోహిత బ్రాహ్మణుడు అట్లయ్యు అయన గారు ముమ్మాటికి నిస్వార్థముగ కుగ్రామమైన పాలెమునకు చేసిన బహుముఖ అభ్యున్నతి వర్ణనాతీతమనుట అతిశయోక్తి దూరము.

"పురుషులందు పుణ్య పురుషురులువేరయా..... అన్న యోగి వేమన మాట సుబ్బయ్యగారి విషయములో అన్వర్థము. ఆధునిక సమకాలిక పురుషులలో ఆయన పుణ్య పురుషుడే పురుషోత్తముడేననుట తథ్యము.

కవి యొక్క వర్ణనాత్మక కర్మ కావ్యమనబడును. అది లఘు కావ్య మహాకావ్య భేదముచే రెండు విధములు.శతకవాఙ్మయము లఘుకావ్య వర్గములోనిది. రీతి, శయ్య, పాకము, అలంకారములు కావ్య లక్షణములు. వైదర్భీ, గౌడీపాంచాలీ రీతులు సంస్కృత కావ్య సంబంధులు. ఈ కవి లలిత, సహజ, సుందరమైన ఆంధ్రీ రీతి

వెలార్చినాడు. శయ్య హంస తూలికను బోలినది. నల్లేరుపైబండి నడకకవలెనున్నది. పాకము పానక రసమును బోలినది. అలంకారములలో స్వభావోక్తితక్క తక్కిన ఉపమ, ఉత్ప్రేక్ష, రూపక, అతిశయోక్త్యాదులు అనృతభూయిష్ఠములు, బందరు బంగారు భూషణముల వంటివి. సత్యభాషణమెంత కష్టమో స్వభావోక్త్యలంకార రచనమంతకష్టము. ఈ లఘుకావ్యమంతట స్వభావోక్తి దేదీప్యమానమై వెలుగొందినది. అతిశ యోక్త్యాదులు మచ్చుకైన దొరుకవు.

పోరలు, ఆటాణ,ముల్లడించుట మున్నగు ముద్దు గొలుపు మాండలికములు స్వర్ణాభరణములలో పొదిగిన మణులవలెనున్నవి.

సుబ్బయ్యగారి ఆ కౌమార స్వర్గారోహణము పాటించిన ఆచార వ్యవహారములు చేసిన మహోన్నత ఘనకార్యములు ఆమూలచూడము. తు.చ. తప్పకుండ క్రమము నతిక్రమించకుండ స్వచ్ఛమైన అద్దములో ప్రతిబింబము వలె ఈ వేంకటేశ శతకము ప్రతిబింబిస్తున్నది. కనుక ఆ పూజ్యుని సవివర చరిత్రమనుట అబాధిత సత్యము. **"అందరు శ్రీ సుబ్బయ్యగారి వలె నిస్వార్థపరోపకారులు కావలెనని ఈ శతకపు ఉద్దేశము."**

పండితుడు కవి కావలెనని నియమము లేదు. కాని కవి మాత్రము పండితుడుగానుండ వలెననుటకచ్చితము. చిరంజీవి గోవర్ధనుగారు పండితకవియనుట తథ్యము. ఇతడు ఈ శతకము ద్వారా దేవ, బ్రాహ్మణ జన్మగ్రామ భారతమాత భక్తునుడట నిరూపించుకున్నాడు. ధన్యజీవి చిరంజీవి.

శ్రీ వేంకటేశుని యనుగ్రహముచే అనతికాలములో మహా కావ్యరచన చేసి మహాకవియగుగాక!

ఓం స్వస్తి

**మామిడేల సీతారామ శాస్త్రి**
విశ్రాంత సంస్కృతోపన్యాసకులు, పాలెము.

మన్మథ మాఘ సిత ద్వాదశీ,
తేది: 19/02/2016, గద్వాల



# పురోవాచ

పాలెము వెంకటేశ్వరునిపై ఇంతవరకే రెండు శతకాలు వచ్చినవి. మొదటిది వెల్లగొండ జ్ఞానదేవకవిది. రెండవది శ్రీ యిమ్మడిశెట్టి చంద్రయ్య గారిది. ఈ రెండు కూడా వృత్త శతకాలు. జ్ఞానదేవకవి శతకములో కొంత ఆత్మకథ కూడా ఉండగా చంద్రయ్య గారిది పూర్తిగా భక్తి శతకము. ఆ వరుసలో ఇపుడీ గోవర్ధనుడిది మూడవ శతకము. ఇది వృత్తం కాక సీసం – వేంకటేశ్వర శతకమన్నప్పుడు సామాన్యంగా ఇది భక్తి శతకమే అనిపించినా సహజంగా ఇది భక్తి శతకం కాదు. ఒక వ్యక్తి శతకం.

పాలెము మహబూబ్‌నగర్ జిల్లా నాగర్‌కర్నూలు తాలూకాలోగల ఒక చిన్న పల్లెటూరు కాని అది గత శతాబ్దంలో తనయొక్క అభివృద్ధి పథకాలచేత 1980 సిద్ధార్థి సంవత్సరంలో వచ్చిన సూర్యగ్రహణంలో ప్రపంచపటానికెక్కి నిలిచింది. ఇక్కడి ఈ గ్రామముయొక్క ఈ అభివృద్ధికి కారకుడు శ్రీ తోటపల్లి సుబ్బయ్య శర్మ గారు. ఆయన గ్రామ పురోహితుడు. అతనికి తన గ్రామాభివృద్ధికి సంకల్పం కల్పించినవాడు ఆ యేడు కొండల స్వామి అయిన వేంకటేశ్వరుడు. అందుచేత ఆయన మొదలిక్కడ ఆ స్వామిని ప్రతిష్ఠ చేయించినాడు. అనంతరం పంచాంగం విడిచి ఫైలు చేతపట్టుకొని **"పురానికేదైనా హితం చేసేవాడే పురోహితుడు".** అనే న్యాయంగా గ్రామాభి వృద్ధికై కంకణం కట్టుకొని తన పౌరోహిత్య ధర్మాన్ని సార్ధకపరచుకొన్న కార్యసాధకుడైనాడు. ఒక్క పాలమూరు జిల్లాలోనేగాక తెలంగాణ మొత్తంలో ఈ సుబ్బయ్యగారివలె తమ గ్రామాభివృద్ధికి పాటుపడినవారు లేరంటే అతిశయోక్తి గాదు. ఈ విషయంలో ఆయనకాయనే సాటి.

ఆయన ఆనాడు పల్లెటూరైన పాలెములో స్థాపించిన రెండు కళాశాలలలో జిల్లాలోని సామాన్య కుటుంబాల విద్యార్థులెందరో చైతన్య వంతులై ఉన్నతోద్యోగాలనంది దూర దూరాలకు వెళ్ళినారు. ఆయన స్థాపించిన ప్రాచ్య కళాశాలలో ఆనాడు ఉత్త ఊరునుండి ఉస్మానియా వరకు తెలుగు పండితులనందించినదంటే దాని కృషి ఎంతటిదో మీరే ఊహించండి. పాలమూరు జిల్లా ఆర్థికంగా పేదదైనా

విద్యా విషయకంగా ఇక్కడి కాలేజీల మూలంగా పేదది మాత్రం కాదు. రాష్ట్రవ్యాప్తంగా ఈ గ్రామం తన పేరును నిలుపుకున్నది. అందుకు **"నాడిక్కడ పనిచేసిన అధ్యాపకవర్గంయొక్క కృషికూడా సామాన్యమేమీకాదు"**. వారందరూ మహామేధావులై వెనకబడిన జిల్లాయైనా ఇక్కడి విద్యార్థులను సానలుతీరిన రత్నాలుగా మలిచినారు. ఇక్కడి ప్రాచ్య కళాశాల ఆనాడు నడిపిన సంచార వైజయంతిక సభలు ఈ గ్రామాన్ని ఉమ్మడి రాష్ట్ర నలుమూలలలో ప్రచారం చేయటమే కాక దేశంలోని నాడు మహా పండితులను గూడా ఆ సభలకాహ్వానించి సన్మానించి తన గౌరవాన్ని వన్నెబెట్టుకున్నది. కనుక గోవర్ధన్‌గారు శ్రీ సుబ్బయ్యగారియొక్క ఈ కృషినంత గ్రామస్థుడైన తాను ఈ శతకములోని సీసాలలో నింపి తనయొక్క జన్మభూమి ఋణం తీర్చుకున్నాడు.

ఇది వేంకటేశ్వర శతకమన్ననూ, ఆ స్వామిని ప్రతిష్ఠించినవాడు సుబ్బయ్యగారే. ఆ స్వామియొక్క అనుగ్రహం చేతనే అతని పథకాలన్నీ ఆనాడు విజయవంతమైనవి. అందుచేత కవి ఈ శతకంలో సుబ్బయ్య గారి ఆనాటి నిర్మాణాలు మరియు వారి పథకాల్ని ఈ శతకంలో ఆ స్వామికి విన్నవించినాడు. ఆకారణంగా ఇది వేంకటేశ్వరశతకమయ్యింది. దీన్ని ఆయన కేవలం అక్షర శతకంగానేకాక తానిందులో తెలిపిన సుబ్బయ్యగారి కృషికి సాక్ష్యంగా ఆనాటి చిత్రాలను కూడా సేకరించి ఆయా విషయాలదగ్గర పొందుపరుస్తూ దీన్ని చిత్రమాలగా రూపొందించినందుకు ఇతనిని నేనభినందిస్తున్నాను. ఈ గోవర్ధనుడీదారినే సాహిత్యవర్ధనుడు కూడా కావలెనని ఆశిస్తున్నాను.

ఇట్లు,

**డా॥ కపిలవాయి లింగమూర్తి**

సాహిత్యారాధకుడు

వాణి సదనం, 17-110,
విద్యానగర్ కాలని,
నాగర్‌కర్నూల్ 509209.
తేది: 1.1.2015



# అక్షర వర్ధనం

మహబూబ్‌నగరం జిల్లాల్లోని 'పాలెం' గ్రామాన్ని ఆదర్శ గ్రామంగా సిద్ధంచేసిన మహానుభావుడు తోటపల్లి సుబ్రహ్మణ్యం గారు 1960-61 సంవత్సరాలలోనే ఇక్కడ ఒక సైన్సు కళాశాలను 1964లో ప్రాచ్య కళాశాలను స్థాపించి సహస్రా ధికులైన మారుమూల పల్లెల్లో నివసించే యువతీ యువకులను శాస్త్ర సాంకేతికరంగాల్లోను-సాహితీరం గాల్లోను ప్రఖ్యాతుల చేసిన విజ్ఞాన వృక్షస్థాపకుడు సుబ్రహ్మణ్యం గారు ఇట్లా అక్షర జీవుడు. వివిద వర్గాలు వివిధ వృత్తుల చేసుకొనేవారికి అనేకానేక సంస్థలను ఏర్పాటుచేయించి వారిని గ్రామంలోని స్వయం పోషకులుగా తీర్చిదిద్దిన విజ్ఞాత శ్రమజీవి ఈ మహానుభావుడు.

ప్రస్తుత రచన 'పాలెము వేంకటేశ శతకము' **"ఘనత గాంచిన సుబ్బయ గ్రామసేవ! వినుతిగావింతు పాలెము వెంకటేశ"** మకుటంతో 128 సీస పద్యాల్లో రచితమైనది. శతకానికి కావలసిన వృత్త మకుట నియమాలున్నాయి. విశేషమేమంటే సంబోధన వేంకటేశ్వరుడు వర్ణనీయ మహావ్యక్తి సుబ్బయ్యగారు ఆయన స్థాపించి అభివృద్ధిచేసినదా వేంకటేశ్వరసన్నిధి. అందుకొరకే మకుటం, **"ఒక వ్యక్తి చేసిన అనేకానేక సాంఘిక కార్యక్రమాలను ఆయన విశేషాలను వర్ణించటం మాత్రం దీనిలోని ప్రత్యేకత"** ఇతరశతకాలవలెగాక కార్య విశేషాలను చక్కని శీర్షికలతో ఈనాటి వారికి తెలియచేయుటం.అదీ సులభశైలి సీసపద్యాల్లో సర్వజన గ్రాహ్యంగాచెప్పటం ఈ పద్ధతి శతకాలు దాదాపు మృగ్యాలే అనుకుంటాను, ఇదొక విశేష రచన. ఈ పద్యాలన్నీ శ్రద్ధగా చదివితే సుబ్బయ్య గారు ఆరంభం నుండి విగ్రహాకృతి దాకా మనముందు కన్పడుతారు.

శతకకర్తయైన గోవర్ధన్-విద్యావినయవంతుడు. పైతృకమైన భక్తి భావన. పెద్దలయందు బద్ధాదరత్వం ఈయనకున్న సల్లక్షణాలు, గోవర్ధన్ పితరులు విద్యావంతులు కాకున్నా విజ్ఞానంకలవారు. పాలెంలోని ఎందరెందరి యిండ్లలోనో కులవృత్తి చేస్తూ మంచి పేరును సంపాదించిన ఉత్తములు, అదే రీతిగా పాలెంలో మా యింటిలోను వృత్తి ధర్మం నిర్వహించి మాకు సన్నిహితులైన వీరికి అంటే వీరి కుటుంబం (బిడ్డలు-కుమారులు)మా వలన -విద్యావంతులు కావటం ఎంతో

సంతోషించదగింది. గోవర్ధన్ అక్కకొండమ్మ ఉన్నత విద్యావతి. ఉన్నత పాఠాశాలయందు అధ్యాపకురాలు. చెల్లెలు శ్రీదేవి కూడా ఇదేరీతి వృద్ధిలో కలదు. తమ్ములు విద్యా నిధులైన ఉద్యోగులు ఇట్లా ఈ కుటుంబమంతా విద్యారంగంలో మెట్లెక్కుతున్న సమయాన్ని తల్లి దండ్రులానందంగా వీక్షించిఅనంతరకాలంలో పరలోకగతులైనారు. వారి దైవభక్తి పెద్దల యందలి గౌరవముతో బాటు ఉన్నత విద్యార్హత. కళాశాలయందు అధ్యాపకత్వం. వీటి అన్నిటినీ మించి, చక్కని కవితాశైలి ప్రాప్తించటం అనేది చి॥గోవర్ధన్ పురాకృతజనుర్విశేషమంటాను. ఇతడు ప్రత్యక్షంగా నాశిష్యుడు కాకున్నా శిష్యులను మించిన విశేష శిష్య లక్షణ భూహితుడుగావున్న కారణం– ఒక ప్రత్యేకత. ఈ విధమైన సచ్ఛాత్రత్వభావనతో నన్ను ముందుమాట వ్రాయమని అభ్యర్థించినాడు. దీనికీయన సాహితీ సహృదయత్వం ముఖ్య కారణం.

పాలెం ప్రాచ్యకళాశాలలో దాదాపు మూడుదశాబ్దాల పైగా ఉద్యోగించిన నేను సహస్రాధిక శిష్య జన విద్వద్విశేషాలు వారిపురోభివృద్ధికి ఇదానీంతన కాలంలోను ఆనందిస్తుంటాను. అది ఒక గొప్ప గురు శిష్య సంబంధ అనురాగ భావనామయ విద్యా సంస్థ గొప్పదనం. దాన్నిస్థాపించి మమ్ములందరినీ విద్యా యజనపరిపూర్తి అవభృథస్నాన పవిత్రీ కృతనపుషులచేసిన చిరస్మరణీయ సుబ్బయ్యగారి హస్త వాసియనేది అస్మాదృశుల బావన.

ఈ శతకాన్ని చదువుతారు కాబట్టి ఇంకా వివరించను. కృత్తికర్తయైన గోవర్ధన్. పల్లెవాడు. పల్లెలోనే చదివి బాగా వృద్ధి చెంది సంస్కారవంతుడైన వ్యక్తి అందుకే మన వూళ్ళ పదాలు పోరలు (పిల్లలు) ముల్లడించి–విసురు రాళ్ళను ఒకనాడు ముల్లాడించేవారు. ఆత్రం (తొందర) వీటికన్నా ఎడ్లబండిని వృషభవాహనం అన్నాడు. మామూలుగా వృషభవాహనుడు శివుడు గదా! ఈయన వృషభాలే భారవహంగాగుంజే వాహనం అని విశేష సమాసంగా చెప్పటం ఆశ్చర్యం(ఒక కవి గారు బండి ఎడ్లను శాకట్యం అన్నారు) నీటి దీపాలు అన్నాడు. దీని భావం? ఇంకా ఒక నాటి మట్టి పాత్రలు అటికలు(76ప) మొదలైనవి కన్పిస్తాయి. మనం విస్మరించిన వడ్లు దంచేరీతి తెలుస్తున్నది(78ప) భర్తీ బండి–నిండా ధాన్యం బస్తాలను బండిపై పెట్టి ఎడ్ల ద్వారా తెచ్చే పద్ధతి(81ప) గుంజెత్తు గురిజ ఎత్తుతులామానంలో గురిగింజను గురిజ అంటారు. దాన్నే ఈయన ఇట్లా ప్రయోగించినాడు (125 ప) “నెయ్యిని వాడటం

వలన కలిగే ఆరోగ్యాన్ని చక్కగా చెప్పినాడు" (72 ప) ఇదంతా లోక వీక్షణం పల్లె చూపు వల్ల వచ్చే విశేష పదయోజనలంటాను, ఇది తనకుదురును విస్మరించని రీతి.

పాలెం గ్రామంలో గోవర్ధన్ కుటుంబంవంటి ఎన్నో కుటుంబాలు ఆనాడు అక్కడి విద్యా సంస్థల పుణ్యమా అని విద్యా వివేకత్వాలబ్బి. ప్రస్తుత కాలంలో ఏమాత్రం గ్రాసవాసోద్దైన్యాలు లేని సంతృప్త కుటుంబీకులుగా మనుగడ సాగిస్తున్నారు. దీనికి మూల శక్తియైన పాలెం సుబ్బయ్యగారి మేలును విస్మరింపక ఆయనను అక్షర యశస్విగా వేంకటేశ నామాంకితంగా నిల్పిన గోవర్ధన్ ఎంత అభినందనీయుడో- ఎంత సంస్కారవంతుడో మనకు తెలుస్తున్నది. ఎవర్నో వర్ణించి ఏదో పొందేకవిత కన్నా **"పుణ్యశ్లోకస్య చరితముదాహరణ మర్హతి"** అనే సూక్తికి నిదర్శనం గోవర్ధన్ రచన.

ఈయనకు పరంపరగా వస్తున్న వేదాంత భక్తి భజన పరత్వానికి పరాకాష్ఠ ఈ పద్యం.

**"సంసారదుగ్ధమున్ సలసలమరగించి**

**దైవచింతనతోడు దాచియుంచి ..."** ఇత్యాది ఈ పద్యం

చాలా మంచిగాకుదిరింది. ఆయన మన: స్థితిని (41ప) చాటునట్టిది.

పాలెంలో మావాడు మేము పనిచేసిన కాలేజీలో ప్రస్తుతం పనిచేస్తూ తన విద్యావైభవ విశేషాల వల్ల**"గురుం ప్రకాశయేద్ధీమాన్"** అనే సూక్తిని సార్థకం చేస్తున్న చి॥ గోవర్ధన్‌ను ఆశీర్వదిస్తూ ఆయన మరింత కవితా పరిణతితో పురోభివృద్ధి చెందవలెనని ఆశిస్తున్నాను.

11-14-25,రోడ్ నెం. 1
హరిపురి కాలని, హైదరాబాద్.
ఫోన్: 9299451266

**డా॥ శ్రీరంగాచార్యులు**
విశ్రాంత ప్రధానాచార్యులు, పాలెం.



# పాలెము అస్తిత్వ వికాసములు

శ్లో॥ వినావేంకటేశో ననాథో ననాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశం ప్రయచ్ఛ ప్రయచ్ఛ

**"ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ**
**వినుతుగావింతు పాలెము వేంకటేశ!"**

అను మకుటంతో దాదాపు 128 పద్యములతో శతకమును సంపన్నం చేసినవాడు చి॥ గోవిందు గోవర్ధనుడు, ఇతనికి ఊహ తెలియకముందే పల్లెను సంస్కరింప పుణాదివేసిన మహనీయులు కీ॥శే॥ శ్రీ తోటపల్లి సుబ్రహ్మణ్య శర్మగారు. వీరినే ఆ ప్రాంతమంతా సుబ్బయ్యగారని పెద్దయ్యగారని, అయ్యగారని, ఆప్యాయంగా పిలుచుకొనేవారు అక్కడి జనమంతా. వారు తన మన, ధన, ప్రాణములను సంపూర్ణంగా సమర్పించి మూలగానున్న పల్లెను పాలెమును ముంగిటకు తెచ్చి అన్ని రంగములలో తీర్చిదిద్దినారు. ఆ మహనీయుని కృషి ఫలాలను అందరూ నాడూ నేడూ రాబోవు కాలాన గూడా ఆస్వాదించాలని వారి మహదాశయము.

ఈ విషయాలన్నింటినీ సమగ్రంగా సమీకరించి చి॥ గోవర్ధనుడు పేరుపేరునా పేర్కొంటూ సవివరముగా సీస పద్యాలలో కీర్తించి ఆ గ్రామమున మొదట వెలసిన కొండలరాయనికి విన్నవించి తనివినొందినాడు. పద్యాలలో ప్రస్తుతించినవన్నియూ పాలెంలో ఒకటీ రెండు తప్ప నిదర్శనముగానున్నవి.

ఇక చి॥ గోవర్ధనుడు కీ॥శే॥ సాయిలు తృతీయ సంతానము. ఆయన రజకుడేగానీ పూర్వజన్మపుణ్యమున చక్కనగు సంస్కారవంతుడు. సాధుశీలి. రాకమచర్ల, హనుమద్దాసు, రామదాసు మొదలగు వారి కీర్తనలను ఎలుగెత్తిపాడు భజనపరుడు. ఊరి పెద్దలలో ఒకనిగా అయ్యగారికి అనుకూలుడు. వినయ వివేకము గలవాడు. ఆయనకు నలుగురు పుత్రులు, ఇరువురు కుమార్తెలు. అందరూ విద్యావంతులు, సచ్ఛీలురు. ఉద్యోగస్తులు.శ్రీ సాయిలు మనస్సును పునికిపుచ్చుకున్నవారు.

క్షేత్ర సాఫల్యంగల ఈ శతకము చి॥ గోవర్ధన్‌కు పేరు ప్రతిష్ఠలను కూర్చగలదని ఆశిస్తూ చిరాయుశ్మంతునిగా ఆశీర్వదించుచున్నాను.

ఇట్లు,
**ములుకుట్ల రామకృష్ణ శాస్త్రి,**
విశ్రాంత సంస్కృతాంధ్రోపన్యాసకులు, పాలెము.

దుర్ముఖి కార్తీక శుద్ధ దశమి,
9.11.2016, పాలమూరు.



# అందరిబంధువయా!!

**"నా తెలుగన్నలెందరొ, య**
**నశ్వరమౌ మకరంద బిందువుల్**
**కైతలలోన నింపి, యజ**
**రామృతమున్ బొనరింప, వారికై**
**సేతల పుల్కరించినది.**
**శ్రీ వరసాహితి, రమ్యభావనల్**
**నా తెలగాణ నిండిన వ**
**నంతము పాలెము వేంకటేశ్వరా!"**

1965 - 67 విద్యా సంవత్సరాలలో పాలెములో చదువుకొన్నప్పుడు మా ప్రాచ్య కళాశాల ఎదురుగానే ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రసాదంగా లభించిన కొద్దిపాటి తెలివితో ఆ రోజుల్లోనే వ్రాసుకొన్న వేంకటేశ్వర శతకములోని ఒక పద్యమిది.

అవును! ఎంత మంది తెలుగన్నలో. శ్రీ స్వామివారి పేరిట ఏర్పడ్డ శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో ఎంట్రెన్స్, డిప్ ఓఎల్, బి ఓఎల్, ఎమ్ ఏఎల్ చదువుకొన్నారు. చదువుకొంటున్నారు. మరి ఈ స్వామి వెలయడానికి, ఇక్కడ ప్రాచ్య కళాశాలతోపాటు సైన్స్ కళాశాల నిర్మాణానికి అన్నీ తానై పూనుకొన్నవారు శ్రీ సుబ్బయ్య గారు. ఈ మూడేనా ప్రైమరీ హెల్త్ సెంటర్, ఉన్నత పాఠశాల భవనం, కళ్యాణ మంటపం, మహిళామండలి భవనం, 30 పడకల హాస్పిటల్, బస్టాండు, హరిజన కాలనీలో ఎన్నో ఇండ్లు అన్నీ ఆయన పుణ్యమే. ఇవే కావు పశు వైద్యశాల, లెక్చరర్స్ క్వార్టర్స్, ఇండస్ట్రియల్ కాలనీ, మంచినీళ్ళ నిమిత్తం మూడు పెద్ద పెద్ద బావులు .... ఇలా 1960 ప్రాంతంలోనే ఎన్నో నిర్మించిన సమాజసేవకులు శ్రీ సుబ్బయ్యగారు. అందరూ పిలుచుకునే "పాలెం సుబ్బయ్య గారు"

అటువంటి ధర్మదాత, కర్మయోగి, విద్యాప్రదాత పాలెం సౌభాగ్య ప్రదాత శ్రీ సుబ్బయ్యగారికి మకుటంపెట్టి, పాలెం వేంకటేశ్వరున్ని సంభోదిస్తూ కవి మిత్రులు శ్రీ గోవిందు గోవర్ధన్ ఈ శతకాన్ని రచించారు. ఏడుకొండల వెంకన్న సన్నిధినుంచి వచ్చిన ఆ రూపాన్ని ప్రతిష్ఠించిన  సందర్భాన్ని ఇలా వర్ణించారు

**సీ॥ ఏడుకొండలపైన నేకాంతమగుచోట తిరుమలేశుని రూపు తేజరిల్లె**
**తలయేరుబండ్లపై తరలించి పల్లెను వేదమంత్రాలతో వేడ్కజరిపె**
**అఖిలాండనాయకునత్యంతభక్తితో ప్రాణయంత్రమునందు పట్టినిలిపె**
**భక్తుల నెల్లరన్ స్పందింపజేయుచు స్వామిలీలలిటకు స్వాగతించె**
**క్షేత్ర మహిమను దర్శింప నాత్రముగను నరుగుదెంచిరి ప్రజలెల్ల తరగకుండ**
**ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామసేవ వినుతిగావింతు పాలెము వెంకటేశ!**

ఎక్కడ సమన్వయ కాఠిన్యం కనిపించదు. సరళంగా స్పష్టంగా పరమ రమణీయంగా ప్రతీ పద్యాన్నీ ఈవిధంగానే చిత్రించారు. కృతికర్త ప్రతీ పద్యానికి ఒక శీర్షిక పెట్టి, ఆ పద్యంలో ఏముందో మొదటే అర్థం చేసుకొని అధ్యయనం చేసే అవకాశం కల్పించారు.

వ్యవసాయ వికాసానికి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి, 30 పడకల ఆరోగ్య కేంద్రానికి. వసతి గృహానికి, శ్రీ వేంకటేశ్వర స్వామి మందిర నిర్మాణానికి, నిత్య నైమిత్తిక పూజల నిర్వహణకు, బ్రహ్మోత్సవ, కళ్యాణోత్సవ శోభాయాత్రల ఏర్పాట్లకు వారు చేసిన కృషిని పద్యాల్లో అందంగా బంధించి అందించారు. డిగ్రీ కళాశాల, ఓరియంటల్ కళాశాల, అధ్యాపకుల క్వార్టర్స్, గ్రామంలో మంచినీరు, విద్యుద్దీపాలు, తంతితపాలా కేంద్రాలు, బ్యాంకు, పశువైద్య కేంద్రాలు, దూరవాణి కేంద్రం, కోళ్ళపరిశ్రమ, పాడి పరిశ్రమ, కుటీర పరిశ్రమలు, రైస్ మిల్లు, పిండి గిర్ని, కళ్యాణమంటపము, ప్రయాణ ప్రాంగణం, మహిళామండలి, గోదాములు, గోబర్గ్యాస్, మంచినీటి బావులు, ఊటబావి ఏర్పాటు, హరిజనులకు గృహాలు ...... ఇలా ఎన్నో ఎన్నెన్నో అంశాలను శతకం ద్వారా అందించి శ్రీ సుబ్బయ్యగారిని గురించి ఈ తరం తెలుసుకునేట్టు చేశారు శతకకర్త.

**సీ॥ అధికారమునకెన్నడారాటపడలేదు ఆస్తిసంపాదించు ఆశలేదు**
**పల్లెవృద్ధికి నిల్చి పరుగిడుచుండెను స్వార్థమైయేనాడు సాగలేదు**
**దేశవిదేశాల తెగ పరిశోధింప నొనరంగ విశ్రాంతి నొందలేదు**
**సాహసకార్యముల్ సంతరించెడివేళ నడ్డంకులెదురైన నదురలేదు**
**కార్యశూరుడై నిరతము కదులుచుండె, పదవులెదురైన తృణముగా పారద్రోలె**
**ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామసేవ, వినుతిగావింతు పాలెము వేంకటేశ!**

ఇప్పుడు ఇటువంటివారే కావాలి. ఆ మహానుభావుడు ఆదర్శమూర్తి. ఎందరికో స్ఫూర్తి ప్రదాత. ఆయన ఉన్న కాలంలోనే తదనంతర కాలంలోనూ

పాలెం ఖగోళశాస్త్రవేత్తల పరిశోధనలకు నిలయమైంది. ఆయన అస్తమయం పాలెము ప్రగతినిరోధకమనిపించింది. ఆ అంశాలన్ని హృదయానికి హత్తుకునే విధంగా శ్రీ గోవర్ధన్ అభినుతించారు.

ఆత్మ బంధువయ్యాడు, ప్రజల హృదయాలలో నిలిచాడు, పట్టుబట్టినవాడు, పాటుబడువాడు, తీర్చిదిద్దినాడు, భక్తిభావభరితుడు, జాతి సంస్కృతి నిలుప శ్రద్ధ జూపినవాడు, మానవతా మూర్తి, కార్యశూరుడు, గాంధేయవాది, గ్రామాభ్యుదయవాది, నిరంతర శ్రమజీవి, ఆరోగ్యప్రదాత, అభ్యుదయవాది..... ఇలా ఎన్నో విశేషణాలు. ఈ శతకం చదువుతుంటే పఠితల మనస్సులలో మెదలుతాయి. ఈ పదాలు ఈ విధంగానే లేకపోవచ్చుగాక !

ఈ అర్థాలనిచ్చే అంశాలు ఇంకా పదులకొలది కనిపిస్తాయి.

శతక పద్య నిర్మాణంలో కవిమిత్రుడు తనకు తానుగా నిర్మించుకొని ప్రయోగించిన పదాలు కూడా సార్ధకంగా నిలిచాయి.

"దుగ్ధ ధారలు, చిత్త చాంచల్యము, జీవనాధారం, ముకుళిత హస్తాలు, అభివృద్ధిపథం, పిల్లా పాపలు, కార్యసాధకుడు, సంసార దుగ్ధము, చీమలబారులు, నిమ్నజాతులు, చావుపుట్టుకలు, రాకాసిమూకలు, వృషభవాహనములు, మామిడితోరణాలు, బ్రహ్మాండనాయక బ్రహ్మోత్సవాలు, స్వామి రూపము, నీటి దీపాలు, కర్షక మిత్రులు, సంసార బాధ్యతలు, అధికారగణము, దండి రోగము, విజ్ఞాన కాంతులు, తండోపతండాలు" వంటి సమాసాలను పదబంధాలను నిర్మాణం చేసుకొని ఛందస్సులో కుదిరించుకొని ప్రయోగించారు. అదేవిధంగా కొన్ని పలుకుబల్లలాంటివి ఉపయోగించుకున్నారు.

"కడుపు మాడుచు, చెమటోడ్చు, సాటివారలు, తీర్చిదిద్దుచూ, కూటికొరకు పోరాటాలు, గొంతెత్తి పలుకు, సేదదీర్చుట, చీమలబారులు, వేలిముద్రలు వేయు వెర్రినాయండ్లు, నెలకొల్పుట, ఔనన్నాకాదన్నా, అడుగులేయుట వస్తువు **ధీరోదాత్తమయింది, సందేశాత్మకమైనది. సమర్పించింది. పరమేశ్వరునికి.**

అందువల్ల ఈ శతకం రమణీయమై పఠనీయమై భవిష్య త్తరాలవారికి మార్గదర్శకమై చిరస్థాయిగా నిలుస్తుందని భావిస్తూ, శతకకర్త శ్రీ గోవిందు గోవర్ధన్ గారిని అభినందిస్తూ, శతకసాహిత్యలోకంలోకి ఆహ్వానిస్తున్నాను. కవిమిత్రుని అభ్యుదయ పరంపరాభివృద్ధిని ఆశిస్తూ పాలెము శ్రీ వేంకటేశ్వర స్వామి కరుణాకటాక్ష వీక్షణాలు ఆయనపై నిరంతరం ప్రసరించాలని స్వామిని ప్రార్థిస్తూ ముగిస్తున్నాను.

**ఆచార్య కసిరెడ్డి**
అధ్యక్షులు, జాతీయ సాహిత్య పరిషత్తు,
తెలంగాణ రాష్ట్రం.

భాగ్యనగర్,
తేది: 16.10.2015,



# అక్షర తిలకము

శ్రీ వేంకటేశ్వరుడు కలియుగ దైవం. అతడు కొలువై యున్న పాలెం గ్రామం 'దేవుని పాలెం'గా సుప్రసిద్ధమయింది. అట్టి పాలెం గ్రామంలో 'గోవిందు'ల కుటుంబం గోవిందుని పరిపూర్ణ ఆశీస్సులతో వర్ధిల్లుచున్నది. ఆ గోవిందుల' వరుసలోని వాడే గోవర్ధనుడు. అతడు చేస్తున్నది. గోవింద స్తుతి. ఇది ఇహపరసాధకము దీనిని పఠించడమూ పరామర్శించడమూ అట్టివే.

ఏ పనినైనా ప్రారంభించే ముందు ఇష్టదైవాన్ని ప్రార్థించడం తెలుగు వారి సంప్రదాయం. తదనుగుణంగానై దైవ ప్రార్థనతో మొదలిడి తల్లి దండ్రులను గురువులను స్మరించి కృతిని కొనసాగించాడు. మాతృదేవోభవ. పితృదేవోభవ, ఆచార్యదేవో భవ యన్నట్లుగా వారిలో దైవాన్ని దర్శించి తరించడం అతని సంస్కారాన్ని సూచిస్తుంది.

పాలెం అనగానే శ్రీనివాసునితో పాటు గుర్తుకొచ్చేది సుబ్బయ్యగారు. తోటపల్లి ఇంటిపేరైనా గ్రామానికి వారు చేసిన సేవలకు గుర్తింపుగా పాలెం సుబ్బయ్యగా ప్రతీతులైనారు. వారు గ్రామానికి చేసిన సేవలను కొనియాడని వారుండరు. తన సొంత ఆస్థిని కరిగించుకొని గ్రామాభివృద్ధిలో తరించిన సుబ్బయ్య గారు తనకంటూ కీర్తిని మిగుల్చుకొని పాలెం జీవనాడిగా మారిపోయారు. వారి జీవనాన్ని తన కృతిలో ఆవిష్కరించిన గోవర్ధనుడు ధన్యజీవి. చదువుతుంటే అతడు సుబ్బయ్య గారిని తన మనోక్షేత్రంలో చిరంజీవిగా నిలుపుకున్నారనిపిస్తోంది.

అతని పద్యాలలో సుబ్బయ్యగారితో పాటు పాలెం వేంకటేశ్వరుని వైభవం సాక్షాత్కరిస్తుంది. అందుకే ప్రతి పద్యం చివరా రెండు పాదాలలో మకుటరూపంగా సుబ్బయ్యగారి సేవలను శ్రీనివాసునికి అర్పించాడు.

పాలెం కళాశాలలో చదివాడు కాబట్టి కళాశాల వైభవాన్ని తలుచుకున్నాడు. పూర్వ విద్యార్థుల సేవలను కొనియాడాడు. ఒక్కమాటలో చెప్పాలంటే తను కన్న, విన్న పాలెం గ్రామాన్ని కనులముందుంచాడు.

ఛందోబద్ధమైన పద్యం వ్రాయడం కష్టమైనపని. పదజాల విస్తృతి ఉండాలి. వాక్యాన్ని విరిచి పాదాలుగా వ్రాయడం కాదు. సంప్రదాయాన్ని అభిమానించే గోవర్ధనుడు ఆరీతినే శతకం వ్రాశాడు. ఇది కొనియాడ దగినది. పనిని అభినందించగలను. కాని కవిత్వ గుణదోషాలను ఎన్నడంలో అసమర్థుడను అందుకే విషయాన్ని మాత్రమే స్పృశించాను. కవిత్వధోరణిని, అంతర్గత అంశాలను పరామర్శించలేదు.

ఇట్టిపనికి పూనుకున్న గోవర్ధనుడు మాసహచరుడు కావడం ముదావహం.

అతడుమరెన్నో రచనలు సాగించాలని మనస్ఫూర్తిగా అభిలషిస్తున్నాను. గోవర్ధనునికి గోవిందుడు సుఖములొసగు గాక!

**శ్రీ రాఘవేంద్రరావు,**

ప్రధానాచార్యులు, ఓరియంటల్ కళాశాల, పాలెం



# శుభాభినందనలు

శ్రీ గోవిందు గోవర్ధన్ – తెలుగు ఉపన్యాసకులు, కీ॥శే॥ శ్రీ తోటపల్లి సుబ్బయ్యగారి గ్రామ సేవా భావనకు ప్రభావితులై శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రార్థిస్తూ "పాలెము వేంకటేశ శతకము" ను సీస పద్యములను సులభశైలిలో మనోహరముగా వ్రాయుచూ, సుబ్బయ్యగారి అభ్యుదయ భావ సేవా తత్పరతను వర్ణించుటకు శక్తినొసగమని శ్రీ వేంకటేశ్వరస్వామిని వేడుకొనుచు శ్రీ వేంకటేశ్వరస్వామి కృపకు పాత్రులై స్వామి శతకమును వ్రాసినారు. సుబ్బయ్యగారు మొదట వ్యవసాయమునుండి ప్రజా సేవకై దృష్టి మరల్చి విద్యా వైద్య రంగముల అభివృద్ధికై కృషి చేసినారు. వెంటనే శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయమును నిర్మింపజేసి శ్రీ వేంకటేశ్వరస్వామివారి విగ్రహమును తిరుపతి నుండి తెచ్చి ప్రతిష్ట గావించి స్వామివారి కృపకు పాత్రులైరి "మానవ సేవయే మాధవ సేవ" గానెంచి మానవ సేవకు పూనుకొని పునీతులైరి.

తరువాత ఉన్నత పాఠశాల విద్య, కళాశాల విద్యపై దృష్టి సారించి కళాశాలలను స్థాపింపజేసి ఈ ప్రాంతమున బీద విద్యార్థులకు జ్ఞాన ప్రదాతయై వారి జీవితములలో వెలుగులు నింపెను.

**"నిండు మనంబు నవ్య నవనీత సమానము పల్కు ధారుణా**
**ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ**
**రెండును రాజులందు విపరీతము" –**

అను సూక్తి సుబ్బయ్యగారికి చక్కగా సరిపోవును. వారి మనస్సు కొత్త వెన్నతో సమానము. ప్రజల కష్టాలను చూచి వెంటనే కరుణించి సహకరించేవారు. వారి మాట వజ్రాయుధముతో సమానము. ద్రోహులపట్ల కొంత కఠినముగా వ్యవహరించినను పిదప దరి చేర్చుకొని ఆదరించేవారు. ఇది నిజమైన బ్రాహ్మణుల లక్షణము. వారు కేవలము పాలెము గ్రామము యొక్క సర్వతోముఖాభివృద్ధికొరకు మాత్రమే కాక ఈ ప్రాంతమునందలి నాయకులకు, ప్రజలకు ఆదర్శప్రాయులై జీవితములలో వెలుగులు నింపిరి. సామాన్యులకు జీవనోపాధిని కలిగించిరి.

**సుబ్బయ్యగారు కారణజన్ములు.** విద్యాదానంచే విద్యార్థుల జీవితాల్లో వెలుగులు నింపి చిరకీర్తి నార్జించిరి. వ్యవసాయ, పారిశ్రామిక, కార్మికరంగములో నూతనోత్తేజము నింపి జీవనోపాధి కల్గించడమేకాక ఆదరముతో వనరులను అభివృద్ధిగావించిరి. ఆదర్శపురుషులుగాను, ఆరాధ్యులుగాను కీర్తింపబడిరి.

సుబ్బయ్యగారి సామాజిక సేవను గ్రామీణాభివృద్ధి గురించి చక్కని సీస పద్యాలతో శతకమును రచించినందుకు చి॥గోవర్ధనుని అభినందిస్తూ ..... సాహితీరంగమున పురోభివృద్ధి సాధించాలని ఆశీర్వదిస్తున్నాను.

**ఎన్.కొండారెడ్డి,**
ఆదర్శ ఉన్నత పాఠశాల, పాలెం.
విశ్రాంత తెలుగు ఉపాధ్యాయులు, గుడ్లనర్వ.



# ప్రేరణ

నిరంతర తపనతో, నిస్వార్థ బుద్ధితో, నిష్కలంక చరిత్రతో, నిత్యనూతనోత్సాహంతో, నిరుపమాన కృషితో, సమాజ హితం కోసం జీవితాన్ని సమర్పణ చేసే సార్థక జన్ములు అప్పుడప్పుడు పురుడుపోసుకొంటారు. తమ సమర్థతతో, సంకల్ప బలంతో సత్ప్రయత్నంతో, సహస్రదళపద్మమై వికసించి సమాజ కాసారానికి సరికొత్త శోభను సంతరిస్తారు. ఒక్కడుగానే నిలిచి లెక్కలేని విజయాలను ఎలా సొంతం చేసుకోవచ్చో చూపుతారు. వారి ఒరవడి ఒజ్జ బంతియై నిలుస్తుంది. వారి నడవడి అభ్యుదయ పథగాములయ్యేలా భావితరాలను మలుస్తుంది. ఆ కోవలోనివారే పాలెం సుబ్బయ్య గారు.

తాను నిత్యం పఠించే "సర్వేజనా సుఖినోభవంతు" అన్న శృతి వాక్యానికి కమనీయ కార్యరూపమిచ్చిన కర్మిష్టి సుబ్బయ్య గారు. విద్యాలయ,వైద్యాలయ, దేవాలయ త్రివేణి సంగమంగా పాలెమును తీర్చిదిద్ది, పల్లెను ప్రయాగ చేసిన ప్రతిభా మూర్తి వారు. తన ప్రజలు ఐహికాముష్మిక రంగాలలో చరించడానికి, తరించడానికి మార్గాన్ని సుగమం చేసిన మహితాత్ములు వారు. "సమానానాం ఉత్తమశ్లోకో అస్తు" అన్న ఉపనిషద్వాక్యానికి ఉజ్వలోదాహరణం వారి జీవితం.

నాడు పాలెములో ప్రజలచేత దండాలందుకున్నవారు ఇద్దరే. స్థిరమూర్తి శ్రీ వేంకటేశ్వర స్వామివారు, చరమూర్తి శ్రీ సుబ్బయ్య గారు. పరహితమతియైన సుబ్బయ్య గారి మూర్తిని, కీర్తిని, స్ఫూర్తిని శతక రూపంలో అక్షర బద్ధం చేసి తన భక్తిని చాటుకున్నారు శ్రీ గోవర్ధన్ గారు.

తెలుగు సాహిత్యంలో "శతకం" ఒక విలక్షణ ప్రక్రియ. ప్రాథమిక కవినుండి పరిణత కవి వరకు వారి వారి స్థాయిని అనుసరించి శతకాన్ని పలుకరించారు. ప్రస్తుతం పద్య రచనకు శ్రీకారం చుట్టడానికి శతకాన్నాశ్రయించారు శ్రీ గోవర్ధన్ గారు.

సుబ్బయ్యగారి సంక్షిప్త జీవిత చరిత్రను గర్భీకరించుక్ను శతకమిది. మకుటంలోనే ప్రధాన విషయాన్ని ప్రస్ఫుటింప చేశారు. గ్రామ సేవకు అంకితమైనవాణ్ణి, తన శతకాన్ని అంకితమిచ్చినవాణ్ణి ప్రస్తావిస్తూ 'ద్వి'పాద మకుటానికి వన్నె చేకూర్చారు గోవర్ధన్‌గారు. ఇందులో సుబ్బయ్య గారి జీవిత విశేషాలతోపాటు నాటి చారిత్రక విషయాలు దర్శనమిస్తాయి. పండుగల వర్ణన, సంచార జాతుల వివరాలను తెలిపారు. (పాలెము) జాతర విశేషాలను వర్ణించిన తీరు సహజ సుందరంగా ఉంది. ఇప్పటి

తరానికి తెలియకుండాపోతున్న బెండు బత్తీసలు, మరీ ముఖ్యంగా 'లాయిలప్పల', 'కుందెనలు', 'అటికెల గూర్చి పేర్కొనడం చరిత్రకుపకరించే విషయం.

శ్రీ వేంకటేశ్వర కళ్యాణాన్ని చూడడానికి దేవతల దిగివచ్చినట్లు చిత్రించడం ప్రబంధ వర్ణనను జ్ఞప్తికి తెస్తున్నది.

"వేలి ముద్రలు వేయు వెర్రి నాయండ్లకు నున్నత హెూదాల నందజేసె" (60)

అన్న పద్యాన్ని చదువుతుంటే

"దర్భ పెట్టెడి వ్రేళ్ళ ధరియింప నేర్చిరి

లీల మాణిక్యాంగుళీయకములు" .... అన్న శ్రీనాథుని పద్య ఛాయ లీలగా గోచరిస్తుంది.

విమానాలను 'ఖగరూప వాహనాల'ంటాడు. 'తిర్రి' వంటి అచ్చమైన మాండలీకాలు అమాంతంగా వచ్చి కూర్చున్నాయి. 'చెవినిల్లుగట్టుకోవడం', 'శ్రీకారం చుట్టడం', వంటి జాతీయాల ప్రయోగం రచనకు సొబగులద్దింది. చివరగా "శ్రద్ధగా చదివిన శ్రవణమందినగాని చక్కని సుగుణాలు చిక్కినిలిచు"

అని ఫల శృతిని ప్రకటించడంలో ఆర్ష సాహిత్య ప్రభావం అగుపిస్తుంది. అయితే ఈ శతక పఠన శ్రవనాదులవల్ల పుణ్యం కాదు, సుగుణాలు దక్కుతాయని చెప్పడం రచనోద్దేశ్యాన్ని తెలియజెప్పుతున్నది. ఈ శతకం ద్వారా అందుకోవలసిన స్ఫూర్తిని జ్ఞప్తికి తెస్తున్నది. ఆత్మీయులు శ్రీ గోవర్ధన్ గారి తొలి రచన ఇది. ప్రథమ ప్రయత్న ముద్రలు అక్కడక్కడా కనిపించినా చంద్రునిలో మచ్చగా భావించాలి.

అధికారముంటేనే అభివృద్ధి చేయగలమనే అపోహలో జీవించేవారికి, ఊకదంపుడు ఉపన్యాసాలతో అరచేతిలో అభవృద్ధిని చూపించే ఇంద్రజాలికులకు, సర్వమానవ సమానత్వాన్ని సాహిత్యంలోనో, సమావేశాల్లోనో రచించి,ప్రవచించి హృదయంలో మాత్రం కులమతాల కుళ్ళును దాచుకొన్న కుత్సితమతులకు, చేసిన పరమాణువంత పనికి పర్వతమంత ప్రచారాన్ని ఆశించే కీర్తికండూతి మూర్తులకు సుబ్బయ్య గారి జీవితం కనువిప్పు. ఇటువంటి చరితార్థునికి 128 పద్యస్తంభాలతో అక్షరాలయాన్ని నిర్మించి ఈ తరానికి, భావితరాలకు ప్రేరణనిచ్చిన శ్రీ గోవర్ధన్ గారికి హార్థికాభినందనలు.

**పల్లెర్ల రామమోహన రావు**

4-3-5, తూర్పు కమాను, మహబూబ్‌నగర్-509001

సెల్: 9177840278



# స్మృతి వల్లరి

పాలెము తలపుల్లోకి రాగానే నా పురాస్మృతులు 'ఊయల్లో ఊగినట్లవుతుంది'. ఏ పూర్వ పుణ్యమో! ఏ యోగ బలమో అన్నట్లు 1978 నుండి 1983 వరకు పాలెము ప్రాచ్య కళాశాలలో నా విద్యాభ్యాసం జరిగింది. చదువు అంటే ఏమిటో, రచన అంటే ఏమిటో, పాండిత్యం అంటే ఏమిటో, ఆత్మీయత అంటే ఏమిటో లక్ష్య, లక్షణపూర్వకంగా నేర్పింది మా కళాశాల.

ఆనాడు కపిలవాయి లింగమూర్తి, మామిడన్న సత్యనారాయణమూర్తి గారల ఇంట్లో నా నివాసం. తెలకపల్లి విశ్వనాథశర్మ, శ్రీరంగాచార్య, సీతారామశాస్త్రి, రామకృష్ణ శాస్త్రి లాంటి దిగ్గంతాలైన గురువుల సాన్నిథ్యం, చదివి నేర్చుకున్నదెంతవుందో చూసినేర్చుకున్నదంత వుంది. గురుజన సాన్నిహిత్యం నన్ను నేను ఒక శిల్పంగా మలుచుకునే అవకాశాన్నికలిగించింది.

ఆ ప్రాచ్య కళాశాలలో ప్రారంభమైన నా రచనా వ్యాసంగం నేటికీ పచ్చగా కొనసాగుతూనే వుంది. నా పలు గ్రంథాలకు మూలబీజాలు పడింది పాలెము కళాశాలలోనే. మా గురువుల కీర్తిని మించినవాడిని కాకపోయినా ముంచినవాడిని కాలేదన్న తృప్తి నిండారా వుంది.

ఇప్పుడు మిత్రులు శ్రీ గోవిందు గోవర్ధన్ పాలెము సుబ్బయ్యగారి మీద వ్రాసిన వేంకటేశ శతకము తెచ్చి నాలుగు మాటలు వ్రాయాలని కోరడంతో నా మనసు ఒక్కసారిగా నాలుగు దశాబ్దాల క్రిందికి వెళ్ళింది. ఎదలోతుల్లో భద్రంగా వున్న స్మృతులు ఒక్కసారిగా ఉబికి వచ్చాయి. అది మా కళాశాల. అది నా చిన్ననాటి ప్రయోగశాల.

ఈరోజు ఆ కళాశాలలో గోవర్ధన్‌గారు పనిచేస్తున్నారని తెలిసింది. మాటల సందర్భంగా నాకు జూనియర్ అయిన శ్రీమతి కొండమ్మగారి తమ్ముడు అని తెలసి నా ఆనందానికి మారాకు వేసింది. గోవర్ధన్‌గారు జీవితంలో స్థిరపడి ఉత్తమ స్థాయిలో సాహిత్య వ్యాసంగం కొనసాగించాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

తేది:12.06.2017
హైదరాబాద్

**– ఆచార్య వెల్దండ నిత్యానందరావు**
తెలుగుశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయం

# పురస్కృతులు

పాలెం గ్రామములో సాధారణ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన సుబ్బయ్య గారు దీన జనోద్ధరణకై ఉద్భవించిన కారణజన్ముడు. దైవాంశ సంభూతుడని ఆయా సందర్భాలలో మానాన్నగారు మాతో చెప్పేవారు.

సుబ్బయ్యగారి ఇంటిలోవృత్తి ధర్మాన్ని నిర్వర్తించే మా రజకులలో మానాన్నగారొకరు. మావారంతా ప్రతి సంవత్సరము పొడవునా వంతుల వారిగా విభజించుకొని కొందరు రోజుల చొప్పున మరి కొందరు నెల చొప్పున కొనసాగుచుండగా మా అమ్మానాన్నలు మాత్రము నెలల తరబడి కొనసాగేవారు. మాకు వచ్చిన వంతులతో పాటు మిగతా వారు ఏ కారణముచేతనైనా మానుకుంటే విషయము వెంటనే మా నాన్నకు తెలిసి ముందుగా అయ్యగారింటిలో పనిని నెరవేర్చి ఆ తర్వాత ఆయా వంతుల వారికి తెలియజేసి ఏమాత్రము లోటు రానీయకుండా వృత్తి ధర్మాన్ని నిర్వర్తించేవాడు.

అయ్యగారిని గురించి ఆ రోజులలో మా నాన్న మాతో చెప్పిన మాటలు అక్షర సత్యాలు. వాటికి నేటి అయ్యగారి కాంస్యవిగ్రహమే నిలువెత్తు నిదర్శనము. ఆ మాటలే నాచే పద్యమాలగా శతక రూపము దాల్చడానికి మూలకారణమైనవి.

నేను 2006సం॥లో వనపర్తి ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఒప్పంద అధ్యాపకునిగా చేరాను. ఆ కళాశాలలో అసిస్టెంట్ లైబ్రేరియన్‌గా పని చేస్తున్న గౌ॥మర్యాద బాల్‌రెడ్డి గారి ప్రోత్సాహముతో పద్య రచనకు పూనుకొని సుబ్బయ్య గారి సామాజిక సేవా కార్యక్రమాలపై పీహెచ్‌డీ చేయాలనే సంకల్పముతో చాలా పద్యాలు వ్రాసుకున్నాను. కాని చందో నియమాలు సరిగా పాటించలేదు.

అనునిత్యము నేను పాలెం వేంకటేశ్వరస్వామిని దర్శించుకొనే క్రమంలో నా అదృష్టవశాత్తు స్వామి అనుగ్రహముతో మంగనూరు వాస్తవ్యులు, పాలెం కళాశాల పూర్వ విద్యార్థి నాగర్‌కర్నూల్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రధానాచార్యులైన గౌ. డా॥వెలుదండ సత్యనారాయణ రావు గారు స్వామి సన్నిధిలో కనిపించారు. వారి చెంతకు వెళ్లి నమస్కరించి పరిచయము చేసుకొని నేను వ్రాసిన పద్యాలను చూపించాను. వారు వెంటనే పద్యాలను పరిశీలించి అందులోని దోషాలను సరి చేసి శతక రచనకై శ్రీకారముతో ప్రారంభించమని సూచించి ప్రతిరోజు పాలెం గ్రామములో వారు నివాసముంటున్న అద్దె ఇంటికి రమ్మని నాకు సమయమును కేటాయించి చందోనియమాలను తెలియచేస్తూ పద్యాలలోని దోషాలను సరి చేస్తూ ఓపికగా సూచనలనిస్తూ నన్ను ప్రోత్సహించి ముందుకు నడిపించారు.

ఈ క్రమములో నేను వ్రాసిన పద్యాలను సమయాసమయాలను పాటించకుండా ప్రత్యక్షముగాను సెల్‌ఫోన్ ద్వారానువినిపించినప్పుడు ఏ మాత్రము విసుగు చెందకుండా శ్రద్ధగా విని నన్ను ప్రోత్సహించిన వారిలో అగ్రగణ్యుడు గౌ.మర్యాద బాల్‌రెడ్డిగారు.

ఆ తరువాత ఎన్నుకోదగిన వారు, మా చిన్నాన్న గోవిందు మడేలుగారు. నేను వీరితో నిరంతరం కలిసి ఉండడము వలన సుబ్బయ్య గారిని గురించిచర్చించుకునేవారము. సుబ్బయ్య గారిపై పద్యాలనువ్రాస్తూ రాత్రి సమయమున గాఢ నిద్రలో నున్నప్పటికీ ఆయనతో నాకున్న చనువు వలన గట్టిగా మడేల్ అని కేక వేసి నిద్రలేపి పద్యాలను వినిపించేవాడిని. మొదట పద్యాలను శ్రద్ధగా విని చివరగా **"ఓ యబ్బ బ్రహ్మంగారు కాలజ్ఞానం రాసినట్లు ఎప్పుడొకటే పద్యాలు బాగుండవి గాని పండుకోరయ్య"** అని ముసిముసి నవ్వుతూ నన్ను ప్రోత్సంచిన మా చిన్నాన్న గారిని ఎప్పటికీ మరచిపోలేను.

ఇంకా సుబ్బయ్య గారు నెలకొల్పిన సంస్థల భవన నిర్మాణాలలో బాల్యము నుండే పాలు పంచుకొనిన తాపీ మేస్త్రీ శ్రీ సొప్పరి నరసింహ్మగారు, సుబ్బయ్య గారికి నిత్యము క్షవరము చేసే గౌ. మంగలి పాండుగారు, పాలెము రామ దాసుగా పేరు గాంచిన గౌ. బోనాసి బక్కన్న గారు, ఆధ్యాత్మిక చింతనాపరుడైన వర్కాల రమేష్‌గారు తదితరులంతా సుబ్బయ్యగారు సాధించిన విజయాలను గురించి కొన్ని సందర్భాలలో ఎదురైన సవాళ్ళను గురించి నా దృష్టికి తెచ్చి పద్యాల రూపంలో కూర్చడానికి ఎంతగానో తోడ్పడ్డారు.

నేను వ్రాసిన పద్యాలను వినిపించినప్పుడు శ్రద్ధగా విని నన్ను ప్రోత్సహించిన వారిలో నాతోటి అధ్యాపక మిత్రులైన శ్రీ కొత్తగోవర్ధన్ గారు (బోటని) శ్రీముద్దెర మద్దిలేటిగారు (పొలిటికల్ సైన్స్) మాతమ్ముడు గోవిందు యాదగిరి(జూనియర్ అసిస్టెంట్), కళాశాల పూర్వ విద్యార్థి చి॥రమేష్ కూడా ఉన్నారు. శతకము పూర్తి కాగానే నా పద్య గురువు గౌ.డా॥ వెలుదండ సత్యనారాయణ రావు గారు మరొకసారి శతకము నంతా క్షుణ్ణంగా పరిశీలించి నా అభ్యర్ధనను మన్నించి ముందు మాటగా **"గోవర్ధనోద్ధరణము"** పేర మనస్ఫూర్తిగా ఆశీర్వాదించారు. వారితోపాటు పాలెం ప్రాచ్యకళాశాల సాహితీ దిగ్గజాల ఆశీర్వచనాలు పొందాలని సంకల్పించాను. వారు సహృదయముతో చేరదీసి శతకమునంతా శ్రద్ధగా పరిశీలించి కొన్ని సూచనలను కూడా అందించి నన్ను అభినందిస్తూ పీఠికల రూపంలో ఆశీర్వదించారు. వారి పాద పద్మాలకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను.

సుబ్బయ్య గారు నెలకొల్పిన సంస్థల శాశ్వత భవనాలను శతకములోని ఆయా పద్యాలకు ఎదురుగా ముద్రింప దలచి ఆలోచన చేసినప్పుడు గ్రామమునంతా

తిరిగి ఆయా ఛాయా చిత్రాలను కెమెరాలో బంధించి అందించిన మా బావ శ్రీ తిరుపతయ్య (మహాదేవునిపేట) గారికి, పాలెం గ్రామ మొదటి మహిళా సర్పంచ్ గౌ. శ్రీమతి శాంతమ్మ గారి ఛాయా చిత్రానికై ఘనపురానికి వెళ్లినప్పుడు తన ద్విచక్ర వాహనముతో పాటు స్వయముగా సహకరించిన మా బావ వెలుగు లక్ష్మయ్యగారు, హైదరాబాద్‌లో నివాసముంటున్న ప్రాచ్యకళాశాల పూర్వాచార్యులను సందర్శించినప్పుడు నాకు తోడుగా వచ్చిన మా తమ్ముడు గోవిందు చంద్రశేఖరు తదితరులంతా ఎంతగానో సహకరించారు. వీందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

శతకములోని 121 పద్యాలు పూర్తి కాగానే శ్రీరామ చంద్రునికి తోడుగా నిలిచిన లక్ష్మణుని మాదిరిగా సుబ్బయ్య గారికి అన్ని వేళల తోడుగా నున్న ప్రజలంతా ముద్దుగా పిలుచుకునే మా చిన్నయ్య గారైన గౌ.రామేశ్వర శర్మగారికి తపాలా ద్వారా బెంగుళూరుకు పంపించినాను. పద్యాలన్నింటిని పరిశీలించి నా దృష్టికి రాని మరి కొన్ని అంశాలను ఫోన్ ద్వారా వినిపించి ఇంకా ఏడు పద్యాలు పెరిగేటట్లుగా సూచనలనిచ్చి. శతకములోని పద్యాల వరుస క్రమాన్ని కూడా ఈ క్రమములో ఉంటే బాగుంటుందని సూచించారు. వారితో పాటు మా కుటుంబ అభ్యున్నతికి మార్గ నిర్దేశకులైన గౌ.డా॥శ్రీరంగాచార్యుల వారు కూడా పద్యాల వరుస క్రమాన్ని సూచించి సహకరించారు. వీరి సూచనల మేరకు మొత్తము 128 పద్యాలు వరుస క్రమములో కూర్చబడినవి.

ఈ విధముగా పాలెము వేంకటేశ శతకానికి ఆశీర్వచనాలు, సూచనలతో పాటు ఆర్థిక, హార్థిక సహకారమునందించిన పెద్దలు, చిన్నలందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. చివరగా నా దృష్టిలో వేంకటేశ్వరుడే సుబ్బయ్య గారిగా ఉద్భవించాడని నమ్మినాను.

## దీనికి సంబంధించిన ఒక చిన్న సంఘటన

పాలెంలో అలివేలు మంగమ్మ విగ్రహ ప్రతిష్ఠకై మంత్రివర్యులు కాసు బ్రహ్మానందరెడ్డిగారు సతీసమేతంగా విచ్చేసి విగ్రహ ప్రతిష్ఠ పూర్తి అయిన తరువాత స్పందించి నిండు సభలో కాసు సుబ్బయ్య గారిని ప్రశంసిస్తూ ఇప్పటి నుండి నిన్ను సుబ్బయ్యగా కాక వేంకటేశ్వర్లని పిలుస్తానని ప్రకటించి ఆనాటి నుండి ఏదైనా సందర్భములో తారసపడినప్పుడు ఆప్యాతతో **"వేంకటేశ్వర్లు బాగున్నావా"** అని పలుకరిస్తూ గాఢంగా ఆలింగనము చేసుకొనే వారని మా చిన్నయ్య గారైన రామేశ్వరశర్మగారి ద్వారా విని నిర్ధారించుకున్నాను.

## శతక ముద్రణ గురించి

ఈ శతకాన్ని సొంత ఖర్చులతో ముద్రించాలని నా పద్య గురువు డా॥వెల్దండ సత్యనారాయణ గారితో ఆలోచించాను. ముద్రణ ఖర్చు అతి స్వల్పమైనప్పటికి కృతి కర్త కాకుండా సాహితీ పోషకుల ద్వారా ముద్రింప చేయాలని సూచించారు. వారి సూచన మేరకు నాగర్‌కర్నూల్ శాసన సభ్యులు శ్రీ మర్రి జనార్ధన్ రెడ్డి గారిని సొప్పరి బాలస్వామి, జంగం సరస్వతమ్మ, జంగం శ్రీనివాసులు తదితరుల ద్వారా సంప్రదించాను. వారు శతక ముద్రణకు సుముఖత వ్యక్తం చేస్తూనే ఇది ఒక **దైవ కార్యం దీనిని ఒక్కొక్కరు కాకుండా కొంత మంది కలిసి చేస్తే బాగుంటుందని సలహా ఇచ్చారు.**

వారి సలహానను సరించి నాగర్‌కర్నూల్ ప్రభుత్వ డిగ్రీ కళాశాలలలో పనిచేస్తున్న నా తోటి అధ్యాపకులు ఆత్మీయ సోదరీమణులైన శ్రీమతి కె. మంజుల భౌతిక శాస్త్రం లెక్చరర్, శ్రీమతి సి.హెచ్. రవళి గణితశాస్త్రం గార్లతో మొదటగా ఆలోచించాను. వీరు ఏమాత్రం సంశయించకుండా సహృదయంతో స్పందిస్తూ మా వంతు సహకారం ఎంత కావాలని ప్రశ్నించారు. వారికి నేను పద్యరూపంలో ఇలా విజ్ఞప్తి చేశాను.

గ్రామ నిర్మాత సుబ్బయ్య ఘనత గూర్చి
వినుతి కెక్కిన పాలెము వేంకటేశ
శతకమల్లితి అత్యంత శ్రద్ధతోడ
ధర్మదాతలు ముద్రింప తరలి రండి

తులసియో పత్రిఫలములో తోచినంత
అందజేయండి తృప్తిగా నాదరించి
క్రతువు నెరవేర్చరండిక గౌరవమున
ఆదరించును వెంకన్న యండనిలుచు

నాటి నుండియు ప్రజలెల్ల నేటి వరకు
ముడుపులందించి వెల్లగా ముదముతోడ
కోర్కెలీడేర్చ నెల్లరు కుదుటబడిరి
కనుడు భక్తితో యరుదెంచి కమలవిభుని

అని విన్నవించాను. వారితోపాటు సాహితీ పోషణకై సహృదయులైన తోటి అధ్యాపక మిత్రులతో చర్చించగా అందరు కూడా ఆర్థిక సహకారమందించి నన్ను

ప్రోత్సహించారు. వీరితోపాటు నా పరిధిలో పరిచయమున్న అధ్యాపకులు, ఉపాధ్యాయులు, వ్యాపారులు, వ్యవసాయదారులను సంప్రదించాను. వారందరూ సహృదయంతో స్పందించి పుస్తక ముద్రణలో భాగస్వాములైనందుకు హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటూ వీరందరికి శుభాశీస్సులందించమని పాలెము వేంకటేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

## సహృదయులైన సాహితీ పోషకులు

సీ॥ సహృదయులైన మా సాహిత్య బంధుగుల్ సుఖశాంతములనొంద చూడ్కులుంచు
సత్సంతుతోడను సౌభాగ్యములనిచ్చి కష్టనష్టాలను కదలజేయు
ప్రేమానురాగాలు పెంపొంద దంపతుల్ అన్యోన్యతను పెంచి హాయికూర్చు
వృత్తి ధర్మములందు తృప్తిగా కొనసాగి ఔన్నత్య పదవుల నందజేయు

తే॥ వినుతికెక్కిన పాలెము వేంకటేశ
వేడుచున్నాను నిన్నునే విశ్వసించి
అందజేయుము ఆశీస్సులాదరించి
అభయమందించి వారికి శుభములొసగు

**అంకితము:** సుబ్బయ్య గారిపై పద్యరచనకై సత్సంకల్పాన్ని కలిగించి నిర్విఘ్నంగా కొనసాగజేసి పాలెము వేంకటేశ శతక నామాంకితమై సాహితీ దిగ్గజాల ఆశీర్వచనాలు కూడా అందించి నా జన్మ పావనమొనర్చిన శ్రీపాలెము వేంకటేశ్వరుని పాద పద్మాలకు సమర్పిస్తున్నాను.

**చివరగా ...**

ఎన్నిసార్లు మార్పులు చేసినప్పటికీ విసుగు చెందకుండా దరహాసముతో ఓపికగా డిటిపి చేసి అందమైన ముద్రణగావించిన సువర్ణప్రింటర్స్ అధినేత శ్రీ గోనెల ఉపేంద్రం గారికి, ఈ క్రతువు నెరవేరడానికి తమ అమూల్య సమయాన్ని పూర్తిగా అందించి రథానికి రెండు చక్రాల మాదిరిగా నిలిచిన జె.శ్రీనివాసులు గారు, సొప్పరి బాలస్వామి గారు. మరియు రథసారధి శ్రీ బ్రహ్మచారి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

## స్వగతము

సీ॥ గోవిందువంశజున్ గోవర్ధనను నామ ధేయుడనై నే విధేయముగను
అధ్యాపకావృత్తి నాధారముగ నెంచి జీవింప సాగితి చిత్రముగను

అరకొరవేతనాలందుచు ప్రతియేట  పాఠాలు బోధింప పరుగులిడితి
సుబ్బయ్య సేవలు సుందరమై యొప్పి మనసునందున నిల్చి మననమయ్యె

తే॥ దైవనిర్ణయమేమని తలతునేను
శతక రూపము నందించ శ్రద్ధ బుట్టె
వ్రాత లెన్నియో పిచ్చిగా వ్రాయుచుంటి
నిల్చె ఘనమైన శతకము నేర్పుగాను

## నా పద్యగురువు శ్రీ డా.వెలుదండ సత్యనారాయణ గారు

సీ॥ సుబ్బయ్య సేవలన్ స్తుతి జేసి విరివిగా  పద్యాలనల్లితి భక్తితోడ
పరిశీలనార్థమై పండిత శ్రేష్ఠుని  నాశ్రయించితి మెచ్చి యాదరించె
శ్రద్ధగా వెలుదండ సత్యనారాయణ ప్రతియక్షరముకూడ పట్టి జూచె
మెండుగా ఛందస్సు మెలకువల్ నేర్పించి  ప్రాస యతులనేయ పట్టిజూపె

తే॥ పూర్తిజేసితి శతకమున్ పొందికగను
అచ్చు వేయించి ప్రజలంత నాదరింప
వెలుగు చుండిన పాలెము వేంకటేశు
పాదపద్మము లందుంచి పరవశింతు.

## నా మానస పుత్రిక స్వామికి అంకితము

సీ॥ మానస పుత్రిక మందాకినిగసాగి శతక రూపము దాల్చె చక్కగాను
వైకుంఠధాముడు వరుడు వెంకన్నను పల్లెను తిలకించి వలపుకొనెను
పాణిగ్రహణమొంద ప్రార్థించినంతనే స్వీకరించెను తాను చిత్తగించి
మామనైతిని నేను మహనీయమూర్తికి ఇంతకంటె నదృష్టమేమియుండు

తే॥ పూర్వ జన్మలో చేసిన పూజవలన
అల్లుడైస్వామి నన్నిట నాదరించె
ధన్యమైపోయె నా జన్మ ధరణియందు
చాలు ఈ జన్మ కిక నాకు చక్కనయ్య

**ఆవిష్కరణ**

పాలెము వేంకటేశ శతక ఆవిష్కరణకొరకై తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారులు డా॥కె.వి.రమణాచార్యులు గారిని ఆహ్వానించడంలో పాలెము గ్రామ పంచాయతి ఈ.వో., జ్ఞాన వికాస భారతి అధ్యక్షుడైన శ్రీ జి.బ్రహ్మచారి గారి కృషి మరువలేనిది. వీరికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.



**– జి. గోవర్ధన్**, పాలెం

# పాలెము వేంకటేశ శతకము

**1.** దైవ ప్రార్థన

శ్రీ వేంకటేశ్వర! శ్రితజన పోషక!
నీలమేఘశ్యామ! నీరజాక్ష!
పద్మావతీ ప్రియ! పక్షివాహన రారా!
వరము కోరను లేదు వారిజాక్ష!
నీ దివ్య రూపమ్ము నిష్ఠతో తిలకించి
పద్యాలనల్లుదు పరమ రూప
హృదయ పద్మమునందు తృప్తిగా నెలకొని
చీకు చింతలు మాన్పు చిద్విలాస!

ఆస్తిపాస్తులు నేను నిన్నడుగ లేదు
కూడు గుడ్డకు నీదయన్ కొరత లేదు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతి గావింతు పాలెము వేంకటేశ!

**2.** మనసులోని కోరిక

సాధు సంతులతోడ సాంగత్యమును లేదు
సద్గ్రంథ పఠనంబు సలుపలేదు
తీర్థయాత్రలు మెండు తిరిగి చూడను లేదు
పుణ్యకార్యము చేయ పూనలేదు.
పరమ భక్తులనెప్డు పలుకరించను లేదు
దుర్గుణంబులవైపు దూకలేదు
బంధు వర్గము పైన భ్రాంతి యేమియు లేదు
మానవత్వము లేక మసల లేదు.

సీస పద్యము లందున చిక్కె మనసు
త్రోవ జూపుము ఛందస్సు తోచునటుల
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతి గావింతు పాలెము వేంకటేశ!

### 3. మా అమ్మ నాన్నలు:

నారమ్మ సాయిలు నామధేయులు మాకు
జననీ జనకులైరి తనువులొసగి
చాకలిపని చేసి చక్కగా పోషించి
చదువు చెప్పించిరి శ్రద్ధగాను
సత్ప్రవర్తన తోడ సన్మార్గమున నిల్పి
దైవ చింతన కల్గి తరలు మనిరి
వృత్తి ధర్మమునందు కృతకృత్యులైయుండి
సుగుణుని మన్ననల్ చూరగొనిరి

అమ్మ నాన్నల యాశీస్సులందు కొనుచు
గ్రామ నిర్మాణ రీతిని గారవించి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతి గావింతు పాలెము వేంకటేశ!

### 4. గురువుల దీవెనలు:

గురువుల బోధనల్ గోప్యమున్ ఛేదించి
విజ్ఞానమందించి వెలుగజేసె
శ్రవణాలకింపైన చక్కని పద్యాలు
మనసునాకర్షించి మదిని నిలిచె
పద్యాల మకరంద ప్రముఖ సూక్తులు నన్ను
మాతృభాషను నేర్వమసలజేసె
హర్షించి రాచార్యులాశీస్సులొసగిరి
పేరు ప్రఖ్యాతుల పెంచుమనిరి

జన్మ సార్థక మౌనంచు సాహసించి
భూరి గుణశాలి పాలెము బుద్ధిజీవి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**5. శ్రీ శేషయ్య సిద్ధాంతి (సుబ్బయ్య గారి తాత గారు)**

సంస్కృతమున పట్టు సాధించి శేషయ్య
వేద పండితుడయి వెలిగిపోయె
సిద్ధాంతి పేరు ప్రసిద్ధమై పంచాంగ
కర్తగా జిల్లాన గణుతికెక్కె
పండిత సభలలో మెండుగా పాల్గొని
సన్మానముల నొంది సాగు చుండె
గద్వాల సంస్థాన విద్వన్మహాసభన్
ప్రతిభను కనపర్చి ప్రణుతినందె

కాంచి తిరుపతి వేంకటకవులు మెచ్చి
ప్రస్తుతించిరి ధీశాలి పౌత్రుడైన
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**6. సుబ్బయ్యగారి తల్లిదండ్రులు : (భాగీరతమ్మ, సత్యమూర్తి)**

ఘన పురోహితుడయి గ్రామాన వెలుగొందె
వ్యవసాయమున నిల్చె వనరు గాను
అతివ భాగీరథి సతితోడ జీవిక
సాగించె తృప్తిగా సత్యమూర్తి
వనమూలికలచేత వైద్యము నందించి
రోగబాధలనెల్ల రూపుమాపె
ఆపుణ్యదంపతులానందముప్పొంగ
పుత్రులిర్వుర నొక్క పుత్రి గనిరి

అమర సుబ్బయ్య రామేశ్వరయ్యలికను
ముద్దుల సరోజ వారల ముద్దుపట్టి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**7. సుబ్బయ్యగారి పౌరోహిత్యము:**

అమ్మనాన్నలు పోర నతిబలవంతమై
పౌరోహితము జేసె పల్లెయందు
సంభావనలనంది సహచరులకు నిచ్చి
యాకలి మంటల నార్పుచుండ
కడుపుమాడుచు ప్రజల్ కంటనీరిడుచుండ
గమనించి మనసంత కరుగుచుండ
సహజ వృత్తిని మాని సాగెను ప్రజలకై
చక్కనాలోచనల్ స్వాగతించ

వృద్ధి నొందించి పేదల తృప్తి గాను
మార్పు దెప్పించి వారలన్ మసలజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**8. సుబ్బయ్యగారి గృహస్థ జీవితము: 1942**

ప్రాయ మందుననింటి బాధ్యతల్ విడనాడి
అశ్రద్ధ పరుడయి అరుగుచుండె
సతి రామసీతమ్మ సద్గుణ రాశితో
సరిగ పెండిలిసేయ సంతసించె
సంసార బాధ్యతల్ సంకెలలై పోవ
సంపాదనార్థమై సాగుచుండె
మున్షిఫాజిల్ యుర్దు ముచ్చటగానేర్చి
పాఠాలు బోధింప బడికి నరిగె

సున్నితంబగు మాష్టారు సూచనలకు
అలిగి సేద్యపు పనులందు తలపు నిలిపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**9. ఆనాటి మా ఊరు:**

గుర్తింపు లేని మా కుగ్రామమున నాడు
మెండుగా కొరతలు నిండియుండె
బడిగుడివైద్యముల్ బహుదూరముగనుండి
త్రాగునీరందక తల్లడిల్లె
అష్టకష్టాలతో నలమటించిరి పేద
ప్రజలెల్ల భుక్తికై ప్రాకుచుండ
హృదయము స్పందించి రేయింబవళ్ళును
పల్లె భూసురుడిట పలువరించి

ఆదుకొననెంచి దీనులకండనిలిచి
వృద్ధినొందించె నత్యంత వేగముగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**10. గ్రామ ప్రజల చేదోడు:**

పల్లె కీర్తిని చాట ప్రముఖ విప్రునిమాట
జవదాటకుండిరి జనులు నాడు
దొరలు దాతలు భూమిదున్ను రైతులునిక
వృత్తి జీవికవారు తృప్తిగాను
ఎకరాలు కుంటల నిసుమంత కొసరక
వందలకొలదిగా పొందుపరచి
సంస్థలు నడిపింప శాశ్వత భవనాలు
నిర్మింపచేసిరి నిండుగాను

భావి పౌరుల తీర్చను పల్లెయందు
సహకరించిరి ప్రజలెల్ల శాశ్వతముగ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**11. మారిన ఆనాటి నిరుపేద కుటుంబాల జీవన విధానము**

కూలినాలిజనులు కులవృత్తులెల్లరు
కృషిసల్పిరానాడు తృప్తిగాను
రాత్రింబవళ్ళను శ్రమచెంది నిత్యము
కుక్షి నింపుకొనిరి కొరతలేక
ఉద్యోగములనైన నొల్లకుండిరి వారు
చేతినిండుగడబ్బు చేరుచుండ
సంసారమీదుచు సతి సుతులెల్లరన్
చదివించిరత్యంత శ్రద్ధతోడ

అక్షరాస్యత పెంపొందె లక్షణముగ
బడుగు జీవులు మేటిగా బ్రతికిరిచట
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**12. వ్యవసాయ రంగమున దెచ్చిన మార్పులు:**

పల్లెను రైతన్న పంట పండించను
రేయింబవళ్ళను రెక్క లిరిచె
జాముురాతిరి వేళ సాహసమునలేచి
మోటకొట్టుచు నీరు తోడుచుండె
చెమటోడ్చి మిక్కిలి  చింతించె నిత్యము
ఫలితాల నొందక పలవరించె
కర్షక మిత్రులన్ హర్షింపజేయను
శీఘ్రమేవిప్రుడు చిత్తగించె.

మార్పులెన్నియో దెప్పించె మనసు నిల్పి
దిక్కులంతట వెలిగెను దినము దినము.
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**13. వ్యవసాయ రంగములో సత్ఫలితాలు: 1949-50**

సారథియై నిల్చి శ్రద్ధగా రైతులన్
వృద్ధి నొందించెను తృప్తిగాను
ఆయిలింజను నిల్పి యాశ్చర్యమును పొంద
బావి నీటిని పైకి పారజిమ్మె
రైతు శేఖరుడయి రాణించి పల్లెను
పుట్లను పండించె పొందికగను
అధికార గణముచే నాహ్వానముల నంది
సత్కారముల చేత సాగుచుండె

కదిలి వచ్చిరి కర్షకుల్ కంటజూచి
అడుగులేసిరి భూసురుననుసరించి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**14. పిండి గిర్ని**

పంటపొలములందు పనిచేయు కూలన్న
ప్రతిఫలముగ పొందె పైరుపంట
సంకటంబలిరొట్టె చక్కని వంటకై
తిరుగలియందుంచి త్రిప్పుచుండె
రోకళ్ళతో పొట్టు రూఢిగా నూడించి
గింజలనుడికించి నంజుచుండె
చాలిచాలని తిండి సాహసంబున పొంది
వెలితిగా జీవిక వెళ్ళదీసె

పిండి యంత్రము నెలకొల్పి ప్రీతిగాను
వెతలు దీర్చెను పురమున వేగముగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 15. ప్రాథమిక ఆరోగ్య కేంద్రము: 1959

ఆరోగ్య కేంద్రము నవసరముగ నెంచి
యాలోచనలు జేసె ననువుగాను
మిత్రబృందము కొంత మిడుకుచు పురమందు
వెనుకంజవేసిన వెరువలేదు
ఆర్థికంబుగ డబ్బు ననువైన ప్రాంతమ్ము
సమకూర్చి పెద్దలన్ స్వాగతించె
కొనియాడిరి ఘన శంకుస్థాపనము వేళ
విశ్వాసమును పెంచె విరివిగాను

పట్టుబట్టియు సాధించె పల్లె యందు
రోగ బాధల నెన్నియో రూపుమాప
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 16. ఆరుపడకల ఆసుపత్రి: 1961

ప్రథమ చికిత్సకై పల్లెను శీఘ్రమే
యారోగ్య కేంద్రము నందజేసె
పలురోగపీడితుల్ పలురీతు లరుదెంచి
రుపశమనము నొంది రున్నతముగ
ఆరోగ్యమును పొందిరాలోచనలు వీడి
జీవిక సుఖముగా చేసికొనిరి
సాటి వారలకెల్ల సహకారమందించి
మానవత్వము కల్గి మసలికొనిరి

సాగజేసెను పల్లెను చక్కగాను
ప్రజల హృదయాలలో నిల్చి ప్రముఖుడయ్యె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 17. 30 పడకల ఆరోగ్య కేంద్రము: 1969

ముప్పది పడకలై మురిపించె పల్లెను
చక్కగా రోగులు సాగిరిటకు
అనునిత్యమిటనొందిరనువైన వైద్యమున్
బాధ లన్నియు తొల్గి బ్రతుకుసాగె
స్థిరవాసములనిల్పి శీఘ్రమే యరుదెంచి
పర్యవేక్షణ జేసి పట్టుబట్టి
దండి రోగమునైన తగ్గించు వైద్యులన్
శ్రద్ధగానందించె సజ్జనుండు

ఆత్మ బంధువై పురమున నవతరించి
సేవజేయించె ప్రజలంత సేదదీర
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 18. విమానాశ్రయము, శాంతినికేతను స్థాపింపనెంచుట:

గగనాన విహరించు ఖగరూప వాహనా
లాశ్రయమ్మును నిల్పనడుగులేసె
మేటి రవీంద్రుని బాటలో మనసిడి
శాంతినికేతను స్థాపనెంచె
దేశ విదేశాల దృష్టి సారింపను
విశ్వమంతట పల్లె వెలుగజేసె
సౌకర్యములనెల్ల సమకూర్చినిత్యము
సంకల్ప శుద్ధితో సాగుచుండె

రేయితోచిన పనులను రీతిగాను
పగలు మరువక శ్రద్ధతో పట్టినిలిపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 19. కూచికుళ్ళ సోదరులు సుబ్బయ్యకు సహకరించుట:

ధర కూచికుళ్ళ సోదరులు తా మందించు
సహకారమును పొంది సాగుచుండె
వసతుల నెన్నియో వసరుగా నెలకొల్పి
పల్లెసీమను మార్చె పట్టణముగ
వివిధ శాఖల నెల్ల విశ్వాసముగ నిల్పి
వెలుగొంద జేసెను వెలితి లేక
నవనవోన్మేషమై నడిపించి పల్లెను
శిఖరాగ్రమున నిల్పె శీఘ్రముగను

మసలె రామచంద్రారెడ్డి మనసునొసగి
వీడకను జనార్ధనురెడ్డి తోడునిలిచె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 20. పశువైద్య కేంద్రము: 1962

పశువులొందెడు రోగబాధల తొలగించి
రక్షింపబూనెను తత్క్షణముగ
వైద్య సౌకర్య మవసరముగా నెంచి
యందుబాటున నిల్ప నడుగులేసె
అన్నదాతల చెంత నాలోచనలు చేసి
వైద్యశాలను నిల్ప పట్టుబట్టె
బుర్రి సింహారెడ్డి పూర్తిగా స్పందించి
యార్థిక సహకార మందజేసె

వైద్యకేంద్రము నెలకొల్పి పల్లెయందు
మూగజీవుల రక్షించి మురిసిపోయె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**21. డా॥ రామచంద్రరావు గారి సేవలు:**

పశువైద్య మందించ పల్లెకేతెంచిన
రామచంద్రారావు ప్రేమతోడ
గోవులు కోళ్ళను కోర్కెతో పోషించి
హర్షింపగను వృద్ధినందజేసె
ఈర్ష్యతో నధికారి యిడుములన్ కలిగించ
పదవిని విడనాడి బ్రతుకుచుండె
స్తుత్యుని యజ్ఞమున్ సుకృతముగా నెంచి
చేదోడుగా నుండ చెంత నిలిచె

తృప్తి నీయని పదవులు తృణమెయనుచు
స్వేచ్ఛగా నిల్చి ముదముతో సేవ జేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**22. ఆదర్శోన్నత పాఠశాల – శ్రీ వెంకయ్య పాత్ర: 1961**

ఆదర్శపాఠశాలాధ్యక్ష బాధ్యతల్
చేతికందింపగా స్వీకరించె
అయ్యవారలనెల్ల నాదర్శముగ నుంచి
పాఠాలు బోధింప పట్టుబట్టె
శాస్త్ర విజ్ఞానమున్ సంగ్రహింపగ జేసి
విద్యార్థుల మెదడు వెలుగజేసె
వెంటాడి పోరల వెరపించి నిత్యము
చదువుల నేర్పించి సంస్కరించె

జ్ఞానమూర్తియు వెంకయ్య నయముగాను
నిలిచె విద్యాభివృద్ధికై నిశ్చలతను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 23. ఉపాధ్యాయ బృందం:

జాతి రత్నాలకై సానబట్టిరి నాడు
ముడిరాళ్ళనెన్నియో ముల్లడించి
అనునిత్యమింపుగా నాంగ్ల భాషనునేర్పి
శాస్త్రముల్ బోధించి శ్రద్ధగాను
విజ్ఞాన కాంతుల వివిధ రంగములందు
వెదజల్ల పంపిరి విశ్వమంత
కారణజన్ముని కలల సాకారమై
విరివిగా కృషిసల్పిమురిసిరంత

బ్రహ్మచారైన వెంకయ్య పల్లెయందు
పాఠశాలను నడిపించె బాధ్యతగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 24. వసతి గృహము: 1962

భోజన వసతుల పూర్తిగా సమకూర్చి
దారిద్ర్యరేఖలు దరికి రాక
చదువుసంధ్యలనెల్ల చక్కగా నేర్పించి
బ్రతుకుబండినడుప బాటజూపె
సరిహద్దుజిల్లాలు శ్రద్ధగా నరుదెంచ
సదుపాయములు జూపి సహకరించె
యేటేట పలువురనెల్లల దాటించి
విలువైన కొలువులో వెలయజేసె

తీర్చి దిద్దుచు పౌరుల తృప్తిగాను
పల్లెకీర్తిని చాటింప పంపుచుండె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**25. చందాలకై వివిధ గ్రామాలను సందర్శించుట**

నిరుపేదలందర పురమున చదివింప
సాలోచనలతోడ సాగుచుండె
ఆర్థికపరిపుష్టినాశించి పల్లెను
ప్రజలచెంతకరిగి పలుకరించె
చుట్టూర నూర్లన్ని చుట్టివచ్చిరచట
స్వాగతించెడివారు సరిగ లేరు
జినుకుంట గ్రామాన చీదరించి యొకండు
యాతానవిదిలించె నబ్బురముగ

ఆశవీడెను ధీరుడే మదురలేదు
సొంత పొలమమ్మి సమకూర్చె సంతసమున
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**26. పురాతన స్వామి సన్నిధి మార్పు: 1961**

శిథిలమై పడియున్న శ్రీవేంకటేశుని
మందిరమును మార్చ మనసు నిలిపె
మనుసాని లింగయ్యలనుజన్ములిరువురు
ధనమునందించిరి దండిగాను
మూడు మాసాలలో ముద్దుగా నెలకొల్పె
భక్తుల హృదయాలు పరవశించె
స్పందనల్ గమనించి సంతోషముగనిట
తిరునాళ్ళు జరిపించె దీక్ష బూని

తరలివచ్చిరి ముక్తికై విరివిగాను
పిల్లపాపలు వెంటరాన్ ప్రీతితోడ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**27. స్వామి విగ్రహ ప్రతిష్ఠ: 1962**

ఏడుకొండలపైన నేకాంతమగుచోట
తిరుమలేషుని రూపు తేజరిల్లె
తలయేరు బండ్లపై తరలించి పల్లెను
వేదమంత్రాలతో వేడ్క జరిపె
అఖిలాండ నాయకు నత్యంత భక్తితో
ప్రాణయంత్రమునందు పట్టి నిలిపె
భక్తుల నెల్లరన్ స్పందింపజేయుచు
స్వామి లీలలిటకు స్వాగతించె

క్షేత్ర మహిమను దర్శింప నాత్రముగను
నరుగుదెంచిరి ప్రజలెల్ల తరగకుండ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**28. అలువేలు మంగమ్మ విగ్రహ ప్రతిష్ఠకై కాసు బ్రహ్మానందరెడ్డి, భార్య కాసు రాఘవమ్మతో వచ్చుట: 1964**

అమ్మప్రతిష్ఠకై యాహ్వానమందించి
రాఘవమ్మనిటకు స్వాగతించె
సంతాన ప్రాప్తికై సంకల్పమును పొంది
సతితోడ పతి కాసు సాగివచ్చె
భక్తితో గుడియందు ముక్తిదాయిని నిల్పి
యాశీస్సులను పొందిరందముగను
కాసుపరవశించి భూసురోత్తమునిక
మారుపేరునబిల్వ మదిని దోచె

వేంకటేశ్వరుడని పిల్చి ప్రీతితోడ
గౌరవించెను నెదురైన కౌగిలించి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**29. గుడిచెంత సుబ్బయ్యగారి పర్యవేక్షణ:**

సౌకర్యములనెల్ల సమకూర్చి గుడిచెంత
నరుగుదెంచినవారి నాదరించె
వసతుల గమనించ వలపున రేయైన
కంటనిద్రను మాని కదలుచుండె
పర్యవేక్షణ జేసి పరమ భక్తులనుండి
సలహాలనెన్నియో స్వాగతించె
వైభవమగునట్టి వసతుల గమనించి
ప్రముఖుల హృదయాలు పరవశించె

మనసు నిలిపిరి ఇష్టమై మరలరాను
స్వామి సన్నిధి తిలకించి చక్కగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**30. శ్రీ వేంకటేశ్వరస్వామి లీలలు:**

తండోపతండాలు తరలివచ్చిరి జనుల్
స్వామిని దర్శింప సంతసమున
పొట్టకూటికొరకు పోరాటములు సల్పి
చచ్చుబ్రతికె వార సంస్కరించె
ఆలుబిడ్డల మధ్య నంతరమ్ములు మాన్పి
సామరస్యము కూర్చి సాగనంపె
ఈతిబాధలు దొల్గ నిష్టమై ప్రజలను
చక్కగా పాలించి సహకరించె

వ్రతములను పెండ్లిలను జర్పి పల్లెయందు
పరవశించిరి భక్తులు పాటిగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**31. వృషభవాహనములపై భక్తులు తరలివచ్చుట:**

వృషభవాహనముల తృప్తిగా జనులెల్ల
నరుగుదెంచిరి పల్లెనందముగను
స్వామి రూపముచూచి సంతోషముగవారి
తనువులు పులకించె వినయముగను
ఇష్టమై ముడుపుల నిష్టతో గుడియందు
బంధించి వెల్లిరి భక్తితోను
కోర్కెలీడేరగా గుర్తుగా విచ్చేసి
వేడ్కల జరిపిరి విరివిగాను

భక్తి భావము కల్పించి ప్రజలయందు
వృద్ధినొందించి పల్లెను వెలుగజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**32. గుడియందు నిత్య పూజలు:**

కళ్యాణ రూపుని కనులార వీక్షింప
కోవెల నెలకొల్పి కొరత దీర్చె
నిత్యకళ్యాణము నిష్ఠతో జరిపింప
వేద పండితులను వెదకి దెచ్చె
స్వామి లీలలు జూప సర్వత్ర వ్యాపించె
భక్తుల హృదయాలు పరవశించె
భువనాన విహరింప పురుషోత్తమునకిట
గరుడాదివాహనాల్ కలుగజేసె

ఉత్సవాలను జరిపించె నున్నతముగ
పరవశించిరి భక్తులు తరలివచ్చి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**33. బ్రహ్మోత్సవములు:**

బ్రంహ్మాండనాయకు బ్రహ్మోత్సవాలను
భక్తితో జరిపించె పల్లెయందు
గ్రామ గ్రామములన్ని ఘనముగా పోటెత్తి
సంద్రమై నిలిచెను స్వామి చుట్టు
తిరుమలేశ్వరునిట తిలకించి శీఘ్రమే
మైమర్చిపోయిరి మనుషలంత
గోవిందనామాలు గొంతెత్తి పలుకగా
కంపనాల్ గ్రామమున్ క్రమ్ముకొనెను

భక్తి పెంపొందె నేటేట ప్రజలయందు
జరిపె శ్రమ కోర్చి జాతరన్ చక్కగాను.
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**34. పాలెం జాతర:**

ఎద్దుల బండ్లపై ముద్దుగా జనులంత
పల్లెజాతర జూడ పరుగులిడిరి
పిల్ల పాపలకెల్ల పిల్లనగ్రోవులు
గడియారములు కండ్లకద్దములును
లాయిలప్పలు గిర్కలను నూదు బుగ్గల
నొసగించిరాట్నము నొనర తిరిగి
మూగి ముత్తైదువల్ మును చేతులును కాళ్ల
గాజులు మట్టెలన్ కాంచి తొడిగి

బెండు బత్తీస చిల్కలన్ ప్రీతిచెంది
బొరుగు పుట్నముల జిలేబి పొందజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 35. కళ్యానోత్సవమునకై గుడియలంకరణ:

కమలనాభునకిట కళ్యాణమును జర్ప
చక్కగా గుడినంత సంస్కరించె
మామిడి తోరణాల్మందిరమ్ముల జుట్టి
అరటిచెట్లను నిల్పె నందముగను
నీటిదీపాలను నిండుగా వెలిగించె
కనులపండుగజేసె కాంతులీని
రంగవల్లికలద్ది రంజిల మనసంత
సంగీతవాద్యముల్ స్వాగతించె

భక్తులరుదెంచి రెందరో పల్లెయందు
స్వామి కళ్యాణమీక్షింప శ్రద్ధ కలిగి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 36. స్వామి దశావతారములు:

మత్స్యాది రూపాలు మహనీయముగ దాల్చి
యవతరించితివయ్య! యవనియందు
రాకాసిమూకల రణరంగమున కూల్చి
ధర్మమున్ కాపాడి తరలినావు
శాంతి సౌఖ్యాలతో సంతసించిరి ప్రజల్
యుగయుగమ్ములనుండి యున్నతముగ
కలియుగ దైవమై కమనీయ రూపాన
నేడుకొండలపైన నిలిచినావు

నీదు రూపము పల్లెను పాదుకొలిపి
కనుల జూపించె మాన్యుడు కమలనయన!
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**37. స్వామి ఊరేగింపు:**

శ్రీదేవి భూదేవి శ్రీకాంతునందగా
మంగళవాద్యముల్ మారుమ్రోగె
గరుడాదివాహనాల్ దరిచేరగానెక్కి
పురువీధులూరేగ పూనుచుండె
అంగనలెదురేగి హారతులొసగుచు
స్వాగతించిరి దారి సాగుచుండె
రచ్చబండన నిల్చి రాజాధిరాజిక
నాదరముగ పల్లెనరయజూచె

చిత్తగించిరి ప్రజలెల్ల శ్రద్ధగాను
అభయమొసగెను శ్రీనాథు డాదరించి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**38. కళ్యాణము తిలకించుటకు దేవతలు పల్లెకు దిగివచ్చుట:**

యక్షకిన్నెరులెల్ల హరిని కీర్తించుచు
దిక్పాలకులతోడ దిగిరి భువికి
కళ్యాణ ఘట్టమ్ము కనులార వీక్షించి
తృప్తినొందెను ఘనదేవగణము
పురుషోత్తమునిపైన పుష్పాక్షతలు చల్లి
ప్రణతులై స్తోత్రాలు పలికినారు
నృత్యగానములెల్ల తృప్తిగా నొనరించి
సేదదీర్చిరి నాథు చెంత నిలిచి

అభయహస్తమునందించె నమర విభుడు
పాడిపంటలు పల్లెలో పరిఢవిల్లె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**39. రథముపై స్వామినూరేగించుట:**

వైకుంఠధాముడు వలపుతో పల్లెకు
సతులతో రథముపై సాగివచ్చె
పురజనుల్ పులకించి పుష్పాక్షతలు చల్లి
శ్రద్ధగా ప్రార్థింప సంతసించె
నారికేళములను నైవేద్యమందించ
బాధలు వైదొల్గ వరములొసగె
ముకిళిత హస్తాలు ముందుంచి వేడగా
ముసిముసి నవ్వుతో మోక్షమొసగె

అందజేసిరి హారతులాత్మ సాక్షి
ముట్టజెప్పిరి ముడుపులు ముందు నిలిచి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**40. స్వామి ఆశీస్సులు:**

పంచభూతమ్ములు పాటించి నీయాజ్ఞ
సర్వత్ర భువిపైన సంచరించు
పాడిపంటలనెల్ల ప్రాణుల కందించి
చక్కగా జీవింప సహకరించు
ధర్మమార్గమునందు తరలుచు జనులెల్ల
సుఖశాంతులనుబొంద చూపు నిలుపు
నీ నామ భజనలు నిష్టతో జరిపెడి
భక్తుల కాపాడి ముక్తినొసగు

నీదు రూపము భక్తితో నిలిపినాడు
కరుణ జూపుము పల్లెపై కమలనయన!
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**41. భక్తులు మోక్ష ప్రాప్తికై పరితపించుట:**

సంసార దుగ్ధమున్ సలసల మరగించి
దైవచింతన తోడు దాచియుంచి
చిత్త చాంచల్యమున్ చిలికించి శ్రద్ధగా
భక్తి వెన్నను దీసి భద్రపరిచి
చావుపుట్టుక లికచాలింప భువిపైన
శక్తియుక్తులనెల్ల సంతరించి
భజనవేడిని ఘన భవ బంధములుదొల్గి
ముక్తినెయ్యిని పొంద మోదమంది

దారివెదకగ భక్తులు దండిగాను
నిన్ను చూపించె మాన్యుడు నెనరుతోడ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**42. దేవాలయ ప్రాంగణమున పూలతోట:**

మంచి గంధము మల్లె మరువపు పొదలింక
విరజాజి సంపెంగ విరివిగాను
బంతి గులాబులు బహువర్ణ సుమములు
చామంతి చెంగల్వ చక్కగాను
మామిడి కొబ్బరి మారేడు పత్రముల్
తులసి మొక్కలు తులతూగగాను
అరటియుసిరి సంత్ర యవసరంబగు పండ్ల
వృక్షముల్ పెంచె సమృద్ధిగాను

మాలలల్లించి నిత్యము మందిరమున
స్వామి కర్పింపగనుచేసె శ్రద్ధగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**43. శివాలయం: 1981**

శైవాలయమునిట సంతరింపను కోరి
ఉత్సాహవంతులన్ ప్రోత్సహించె
ఐశ్వర్యవంతుడుననువుగా స్పందించె
మనుసాని రాములు మనసు నిల్పి
నీలకంఠుని గుడి నిష్ఠతో నిర్మించి
యభిశేకములు జర్పె నందముగను
పర్వదినములందు భక్తులునరుదెంచి
యుపవాసదీక్షల నొనరజేయ

పార్వతీశుడు తిలకంచి పరవశించె
స్వామియాశీస్సులను పొంది సాగిరంత
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**44. కళ్యాణ మంటపము:**

సువిశాలమగుచోట సొగసైన భవనమున్
వెంకన్న గుడిచెంత వెలియజేసె
చక్కని వసతులన్ సౌకర్యముగ నిల్పి
ప్రజల ఇబ్బందుల పారద్రోలె
కోర్కెతోనెందరో కుగ్రామమరుదెంచి
నూరేళ్ల బంధాల నొనరచేసె
వెంకన్నయాశీస్సు సంకటంబుల ద్రోలి
సంసార జీవిక సాగజేసె

నిత్యకళ్యాణముల జర్పి నిండుగాను
వెలుగజేసెను పల్లెను వలపుతోను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**45. పాలెము గ్రామములో సుబ్బయ్య గారు జరిపించిన వివిధ పండుగలు:**

**సంక్రాంతి పండుగ:**

పండుగ వేళలో పశుసంపదను రైతు
పరిశుభ్రమొనరించి బండ్ల తీర్చి
ఇంపైన రంగులు సొంపుగా ముద్రించి
మువ్వగజ్జెలనెల్ల పొందు పరచి
చక్కని బండ్లకు సంధించి గుడిచుట్టు
పరుగుదీయించిరి వరుసగాను
ఘల్లు ఘల్లున మువ్వ గజ్జెల సవ్వడి
ధనధనమని బండ్లు తరలుచుండ

బండ్లపైనున్నభక్తులు పరవశించి
ఏడుకొండల స్వామిని వేడుకొనిరి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**46. దీపావళి పండుగ – నరకాసుర వధ:**

దీపావళిని పల్లె దిక్కులంతట వెల్గె
ఘనమైన సంబరాల్ గగన మందె
ముప్పది యడుగుల మూర్ఖనరకు దేహ
ప్రతిమను గుడిముందు పట్టి నిలిపి
సత్యబాణము చేత సంధించి భూసుతున్
తలను వ్రక్కలు చేసె వలపుతోడ
ధమధమ ధ్వనులతో నమర శత్రునిరూపు
తునియలై పడిపోయె తుప్పుమనుచు

మరణ దృశ్యము తిలకించి పరవశమున
చెలగి ప్రజలెల్ల పండగ చేసికొనిరి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**47. దసరా యుగాది పండుగలు:**

దసరా యుగాదులన్ తప్పక జరిపించె
భక్తిభావము నింపె పల్లె యందు
నూతనోత్సాహాన నూత్న వస్త్రాలతో
నరుగుదెంచిరి ప్రజలందముగను
బంగారమని జమ్మి భ్రాతృత్వమున పంచి
యాలింగనాశీస్సులందుకొనిరి
పేరుబలములెల్ల ప్రీతిగా వినజేసి
తగిన పంటల నేయ తలపు జేసె

సంతసంబున ఉత్సవాల్ శ్రద్ధగాను
మరువకుండగ నేటేట జరుపుచుండె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**48. శ్రీరామనవమి కృష్ణాష్టమి:**

పట్టాభిషేకమున్ భక్తితో జరిపించి
యేకపత్నీవ్రతు నెరుకజేసె
కృష్ణాష్టమి కనుల కింపుగా జరిపించి
గొల్ల చేష్టల నెల్ల గుర్తు చేసె
చెలగి యేకాదశి శివరాత్రులందున
వ్రతములన్ జరిపించె మితములేక
నిత్య కళ్యాణము నిష్ఠతో జరిపించి
పచ్చతోరణముల పట్టి నిలిపె

భక్తి పెంపొంద నిత్యము ప్రజల యందు
సరిగ పండుగల్ గుడియందు సాగజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**49. ఉన్నతాధికారుల నాహ్వానించుట:**

ఉన్నత పదవి యందున్నట్టి పెద్దలన్
వెంకన్నగుడికి రప్పింపజేసె
బాజా భజంత్రీలు పలికించి చక్కగా
వేదమంత్రాలతో వేడ్క జరిపె
గ్రామాన నెలకొన్న కడగండ్ల నన్నియు
చెవినిల్లు కట్టుక చెప్పుచుండె
శీఘ్రమే పనులకు శ్రీకారమును చుట్టి
చక్కగా ముందుకు సాగుచుండె

నిలిపెనెన్నియో సంస్థలన్ వెలితిలేక
తీర్చిదిద్దెను పల్లెను తీరుగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**50. డిగ్రీ కళాశాల స్థాపింప బూనుట: 1962**

ఆరోగ్యకేంద్రమై స్వాగత సభయందు
ఉన్నత విద్యకై యూహ చెందె
విద్యాలయమునిట వెలయింపజేయను
సాహసంబున నిల్చి శపథమందె
గ్రామాన మిత్రులు సామాన్యమా యని
ప్రశ్నలన్ సంధించి పలుకుచుండ
అధినాయకుల చెంత నాలోచనలు జేసి
సాధించి చూపెను చక్కగాను

చదువ నిరుపేద లెల్లర స్వాగతించి
మెప్పునొందెను జిల్లాను మెండుగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**51. డిగ్రీ కళాశాల ఆచార్య బృందం:**

భౌతిక శాస్త్రాది పట్టాభిషిక్తులై
పల్లెకేతెంచిరి పండితాళి
ప్రథమ ప్రాచార్యుడై ప్రతిభతో వెలుగొందె
నాగేశ్వరాఖ్యుడు నయముగాను
ఆచార్యులందరు నంకిత భావాన
పాఠాలు నుడివిరి మేటిగాను
ఉన్నతమగు బోధనుత్తీర్ణతను తీర్చి
కీర్తిచాటిరి నాడు పూర్తిగాను

ఇంజనీయర్లు డాక్టర్లు పృథివియందు
నిండియున్నారు నేటికి నిండుగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**52. ఓరియంటల్ కళాశాలను స్థాపించుట: 1964**

మాతృ భాషయెడల మమకారమును పెంచ
ప్రాచ్య కళాశాల పాదుకొలిపె
కావ్యేతిహాసాల కమ్మని సూక్తుల
నేటి మానవులకు నేర్పగలిగె
మానాభిమానాలు మరచిన ప్రజలను
మానవత్వము నింపి మసల జేసె
స్వాతంత్ర్య సమరాన సాహస రచనల
ఉద్బోధనలు చాటి యూపిరూదె

జాతి సంస్కృతి నిల్పను శ్రద్ధజూపి
తెలుగు భాషను రాష్ట్రాన వెలుగ జేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 53. ప్రాచ్య కళాశాల ఆచార్య బృందం:

విశ్వనాథాదులు వివిధ భాషలయందు
పాండితీ దిగ్గజాల్ పల్లెకరిగి
ప్రాచ్య కళాశాల పాఠ్యాంశములచేత
విజ్ఞానవంతుల వెలయజేసి
అక్షరాలను నేర్పి శిక్షణనిప్పించి
పంతుళ్ల నిలిపిరి బడులయందు
కవులు పండితులను కావించి నిత్యము
పల్లె కీర్తిని చాట పాటుబడిరి

ఘనులు కసిరెడ్డి రుకునుదీన్ గౌరతతులు
నిలిచిరెందరో యువకవుల్ నేటికికను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 54. అధ్యాపకుల గృహ సముదాయము:

ఆచార్య బృందము నాహ్లాదముగ నుంచె
సువిశాల ప్రాంతాన సొగసుగాను
శాశ్వతమగు గృహ సముదాయమును నిల్పి
సౌకర్యములు కూర్చి చక్కగాను
ప్రకటననిప్పించి బహుదూరములనుండి
పంతుళ్ల రప్పించె వనరుగాను
పల్లెను స్థిరపడి పాఠాలు బోధింప
నరుదెంచి రెల్లరన్ స్వాగతించె

పరవశించిరి బోధకుల్ పనుల జూచి
గ్రామ కీర్తిని చాటిరి గగనమంత
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**55. రాష్ట్ర నాయకులు ఆశ్చర్యపడి పాలెమును దర్శించుట:**

నిమ్న జాతులపైన నెనరుంచి చదివింప
భోజన వసతుల పొందజేసె
చీమలబారులై చెంత చేరిరి ప్రజ
లానందముగ విద్యనందజేసె
వివిధాంశములయందు విజ్ఞానులను తీర్చి
విశ్వమంతట నిల్పి వెలుగజేసె
అగ్రనాయకగణ మాశ్చర్యమునుపొంది
వీక్షింప కదలిరి విరివిగాను

పూర్ణకుంభముతోడను పురమునకును
స్వాగతించెను వారల చక్కగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**56. పాలెము కళాశాలలో యన్.సి.సి.**

దేశసేవను కోరి దీక్షగా యువకులన్
సంసిద్ధులను జేసి చక్కగాను
తనువును మనసును తగినట్లు దృఢపర్చు
శిక్షణ నిప్పించె లక్షణముగ
దేశరక్షణ కోరి దేహమునర్పించు
సాహసవీరులన్ స్వాగతించె
సరిహద్దులందున శ్రద్ధగా నెదురొడ్డి
ముష్కరులందరన్ ముట్టడింప

పంపుచుండెను నేటేట పల్లెనుండి
మాతృభూమిని రక్షింప మనసు నిలిపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 57. చలనచిత్ర ప్రదర్శనశాల

చక్కని నటులను స్వాగతించెనిట ప్ర
దర్శనలిప్పించె ధరణిసురుడు
ప్రజల వినోదమై ప్రముఖ నర్తకియైన
రాజసులోచనన్ రాకజేసె
హాస్య పాత్రలనెల్ల హాయిగా పోషించు
రేలంగి నిట దెచ్చె రీతిగాను
చిత్ర ప్రదర్శనై చెంత శాలను నిల్ప
తలపోసి శ్రద్ధగా వెలయజేసె

బుర్రి వేంకటరెడ్డిని ప్రోత్సహించి
సంతరింపగజేసెను చక్కగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 58. గ్రామాన భువన విజయమును ప్రదర్శించుట 1968

శ్రీకృష్ణరాయల స్థిరమైన ఘనకీర్తి
మారుమూలన చాటమనసు దోచె
భువన విజయమును పురమున దర్శింప
కవుల నాహ్వానించి గౌరవించె
విశ్వనాథాదులు విరివిగా నరుదెంచి
రష్టదిగ్గజములై రిష్టముగను
పద్య గద్యాల వాగ్బాణాలు సంధించి
విరివిగానిటునటు విసరుకొనగ

పరవశించిరి సాహితీ ప్రముఖులంత
నిర్వహించెను పల్లెలో నింపుగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**59. కళాశాలలో ఉపన్యాస పోటీలలో – శారదా విగ్రహము నందించుట:**

నయముగా నిటనుపన్యాసపోటీలను
శ్రద్ధగానెన్నియో జరుపుచుండె
కబురంపి శాస్త్రదిగ్గజముల రప్పించి
సాహిత్య సభలను సాగజేసె
విఖ్యాత కవులైన విశ్వనాథాదుల
న్యాయాధిపతులుగా నరయజేసె
ప్రతిభ చాటిన మేటి పండితు శారదా
విగ్రహమందించి వెలుగజేసె

పల్లె జాతరయందున నుల్లసమున
వాసికెక్కించె నేటేట వదలకుండ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**60. నిరక్షరాస్యులకు ఉద్యోగములనిచ్చుట:**

వేలిముద్రలు వేయు వెర్రి నాయండ్లకు
నున్నత హెూదాలనందజేసె
భిక్షపు జీవులన్ బీదసాదల నెల్ల
వివిధ సంస్థలయందు వెలయజేసె
శ్రమచెందు కూలన్న క్రమమైన పనులకై
వ్యవసాయ కేంద్రమ్ము వనరుజూపె
కులమత భేదముల్ గుణముగా నెంచక
మానవత్వము కల్గి మసల జేసె

పల్లె నభివృద్ధి చెందించ పట్టు బట్టి
పెక్కు సంస్థల నెలకొల్పి పేరుగాంచె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**61. గౌరవ ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి – సుబ్బయ్య పట్టుదల:**

గాంధీమహాత్ముని గౌరవ సూక్తులు
సుజనుని మనసును చూరగొనెను
చక్కగా పల్లెను సంస్థల నెలకొల్పి
యధినాయకులనిట స్వాగతించె
నీలమరుగుదెంచె నిధుల నాశింపగా
నెపముల చూపించి నిలుపజూచె
ఔనన్న కాదన్న నాపము పనులను
వెంకన్న యిష్టమై వెలుగుననుచు

నిబ్బరంబుగ మేధావి నిలిచి పలికె
నలిగి పోయెను నీలము నిలువకుండ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**62. నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేయుట:**

దైవ సంకల్పము దండిగా వెంటాడి
పదవి వీడగ జేసె సదయుడయ్యె
వాహనాల్జాతికి వరముగా నందించె
నీలమాజ్ఞాపనల్ నిలువలేదు
భారత న్యాయాధిపతి తీరుమానమున్
శిరసావహించెను శీఘ్రముగను
ముఖ్యమంత్రిగ కాసు ముందుండి నడిపించె
చకచక నిధులన్ని సాగివచ్చె

సంతసంబున దారులు స్వాగతించె
నడుగు లేసెను ధీరుడు తడయకుండ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**63. యూ.జీ.సి. నిధులను దెప్పించుట: 1963**

యూ.జీ.సి. నిధులకై యోచించి విజ్ఞుడు
శాఖాధిపతులతో చర్చ జరిపె
విద్యార్థుల కొరత విస్పష్టమని వారు
సందిగ్ధ ప్రశ్నలన్ సలిపిరపుడు
ప్రత్యేక దృష్టితో పరిగణింపగజేసి
నిధులు రప్పించెను నిండుగాను
బీదసాదలనెల్ల ప్రేమతో దరి చేర్చి
విజ్ఞాన మందించి విరివిగాను

పంపు చుండెను ప్రతియేడు పల్లెనుండి
భరతమాతకు జ్ఞానులన్ తరగకుండ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**64. గుడి సొమ్ము ప్రతి సంవత్సరము పాతికవేల రూ.లు కళాశాలకు వెచ్చించుట:**

విద్యాలయమునిట వెలుగొందజేయను
చక్కగా మిత్రులన్ చర్చ జరిపి
ప్రతియేట గుడి సొమ్ము పాతికవేలను
నందించ తీర్మాన మందజేసె
సిబ్బంది వేతనాల్ శీఘ్రమే చెల్లించి
యానందముగ బోధనందజేసె
విద్యార్థి సుమముల వికసింపజేయుచు
విశ్వమంతట నింపి వెలుగజేసె

నడుగులేసెను వృద్ధికై యాగకుండ
సంతరించెను పనులను చక్కగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**65. గ్రామమున మంచినీటి సరఫరా: 1965**

భూగర్భ జలమును భువిపైకి రప్పించి
ప్రజల దాహము దీర్చ పట్టుబట్టె
నేర్పుగా నెత్తైన నీటి తొట్టిని నిల్పి
విరివిగా నల్లాలు వెలయజేసె
అను నిత్యమును నీటి ననువుగా వదిలించి
పురమంత పారించి మురియజేసె
పరిసర ప్రజలెల్ల నరుదెంచి తిలకించి
పరవశించిరి నీటి పరుగుజూచి

బావి నీటిని చేదెడు బాధలేదు
ఇండ్లముందర దుమికించె నింపుగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**66. గ్రామమున వీధి దీపములు:**

గ్రామ వీధులయందు ఘనమగు స్తంభాలు
నెలకొల్పి దీపాల నిలువజేసె
అంధకారము దొల్గె నందముగను పల్లె
కనువిందు చేయుచు కాంతులీనె
దిక్కులంతట కాంతి మిక్కుటమ్ముగ నిండి
వెన్నెలన్ మరపించి వెలుగుచుండె
పరికించ భృత్యులన్ పల్లెను నియమించి
రక్షించె గ్రామమున్ రాత్రిపగలు

పురుగు బూచిభయములెల్ల తరిమి వేసి
ప్రజల సుఖముకై నిత్యము పాటుబడెను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**67. తంతి తపాల కేంద్రములు: 1966**

తంతి తపాలలు స్థాపించి పురమున
సేవలనందించె శీఘ్రముగను
ప్రజల యోగక్షేమ వార్తలనందించి
యిరువుర సంధించి మురియజేసె
పొందుపర్చినడబ్బు పొందికగాదాచి
వృద్ధినొందించె సమృద్ధిగాను
జాతీయమున ఘన సంబంధముల కూర్చి
శాశ్వతముగ కొనసాగజేసె

ప్రజల మధ్యన వారధి పాదుకొల్పి
కార్యజాతములన్నియు కదుపుచుండె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**68. యూనియన్ బ్యాంక్: 1967**

సామాన్య జనులకు చక్కగా ఋణముల
నందించు సంస్థను నండనిలిపె
వ్యాపారులును రైతు లేపుగా జీవింప
చేయూత నొసగను చెంతనిలిపె
ప్రజలకప్పులొసగి ప్రాణాల కబళించు
వడ్డి వ్యాపారుల నడ్డగించె
చోరభయములేక సుఖశాంతములనొంద
పసిడిపైకములెల్ల భద్రపరిచె

బ్యాంకు సేవలనందించి ప్రజలనెల్ల
ప్రోత్సహించెను వృద్ధికై పూర్తిగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**69. దూరవాణి కేంద్రము: 1967**

సంభాషణలనెల్ల సంగ్రహించెడి యంత్ర
భూతమున్ రప్పించి పురమునందు
బంధుమిత్రులు పల్కు బాగోగులను గూర్చి
శ్రవణాలకందించె చక్కగాను
నిత్యము వార్తలన్ ప్రత్యక్షముగ విని
ప్రజల హృదయమంత పరవశించె
పై యధికారులు పల్లెకు నేతెంచి
పాలనావిషయాలు పంపజేసె

పట్టుబట్టియు తెప్పించి పల్లెయందు
కోరి నిలిపెను కేంద్రమున్ కొరత దీర్చె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**70. పాడిపరిశ్రమ: 1968**

రైతన్న వృద్ధికై ప్రీతిగా పెద్దయ్య
పాడి పరిశ్రమ పాదుకొలిపె
కలకత్త జెర్సీల తలపున దెప్పించి
యనువైన పోషణ నందజేసె
దుగ్ధ ధారల బహుదోహాల నింపుచు
విరివిగా పల్లెలో విక్రయించె
చక్కగా డబ్బును సమకూర్చి నిత్యము
నెల నెల ఖర్చుల నెల్లదీసె

పిల్లపాపలనెల్లను ప్రీతిగాను
చదువు చెప్పించి రైతన్న సంతసించె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 71. కర్షక మిత్రుల జీవన విధానము

పశువులన్ పోషించి పాడిపంటల నొందె
వ్యవసాయదారుడు పల్లెలోన
జీవనాధారమై స్థిరముగా బ్రతుకుచు
వృద్ధినొందుచునుండె బుద్ధిగాను
పెయ్యకోడెలనెల్ల ప్రేమగా పోషించి
పొలము దున్నుటకైన పూనజేసె
పాలుపెరుగునమ్మి ప్రగతిపథమునందు
సంసారమీదుచు సాగుచుండె

పేడ పెంటలనెల్లను ప్రీతిగాను
పైరు కందించి మేలైన పంటనొందె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 72. నెయ్యినుపయోగించినచో కలుగు లాభాలు:

కామక్రోధాదులన్ కరిగించు ఘృతమిక
పురుషార్థములనింపి పుష్టినిచ్చు
విజ్ఞానమందించి వికసింపచేయును
తేలికైకాయము తేలియాడు
రాక్షసబుద్ధిని తత్క్షణముగ మార్చి
సద్భావమున నిల్పి సంస్కరించు
గురునకే గురువయి గుణములందుత్తమ
సాత్వికంబును పెంచి సాగజేయు

క్షీరధారలనందింప చింతలేక
పల్లె రైతును మళ్ళించె పాడివైపు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**73. కోళ్ళ పరిశ్రమ: 1968**

అన్నదాతకు జీవనాధారమును జూప
నాశించి పది కోళ్ళ నాదరించె
అనతి కాలమునందు నధికమౌ లాభాల
నార్జించి ముందున కడుగులేసె
లక్షణంబుగ నిట లక్ష కోళ్ళను పెంచి
దిక్కులంతట వెల్గె మిక్కుటముగ
సరిగ పరిశ్రమన్ పరిఢవిల్లగ జేసి
ప్రజలాదరింపనుపలుకరించె

శ్రద్ధ తోడను కొందరు సాహిసించి
వృద్ధి నొందిరి అత్యంత వేగముగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**74. గ్రామమునందు పరిశ్రమలు:**

సాగి పరిశ్రమల్సాధించి మెండుగా
పల్లెలో నెలకొల్పె ప్రజలకొరకు
జీవనోపాధికై శీఘ్రమే యరిగిన
శ్రమజీవులెల్లరన్ స్వాగతించె
గౌరవవేతనాల్ కల్పించి నెలనెల
చక్కగా జీవింప సహకరించె
అభివృద్ధి పథమునందడుగు లేయగ జేసి
యానంద ఫలితాల నందజేసె

సుఖము నొందిరి కార్మికుల్ సుందరముగ
జీవనమునందిరిట వారుచింతలేక
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 75. చక్కెర బెల్లముల ఉత్పత్తి: 1976

చక్కెర బెల్లము సంసిద్ధమొనరించి
పల్లె కీర్తిని చాటె పట్టుబట్టి
చెరకు తోటను పెంచి శీఘ్రమే ప్రజలకు
నూతనోత్తేజము నూరిపోసె
శ్రద్ధగా రైతులు సాగుచేసిరి పంట
లాభాలనందించె లక్షణముగ
యంత్రభూతమునిట ననువుగా నెలకొల్పి
చెరకు నోటికి నంద చేరవేసె

రసము దీయించి క్రమముగా రాశిపోసి
సంచులకు నింపి నిత్యము సాగనంపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 76. అల్యూమినియం గిన్నెల తయారి: 1976

తళుకు లీనెడు వంట తగరపు పాత్రలన్
సంసిద్ధమొనరించె శ్రద్ధగాను
పలుపరిమాణముల్ వస్తు సామగ్రిని
విరివిగా ప్రజలకై వెలువరించె
అటికెకుండలు మర్వలనువైన దుత్తలున్
మట్టి పాత్రలనెల్ల మరువజేసె
మంటచేవేడెక్కి మరుగునపడి కొన్ని
ముదిత కోపముచేత ముక్కలయ్యె

వంటలెన్నియో చేయింప వనరుగాను
మార్పుదెచ్చెను పల్లెను మగువకొరకు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**77. కుటీర పరిశ్రమలు:**

గృహిణులెల్లరు స్వయం కృషి సల్పి యింటిలో
ధనము సంపాదింప దారిజూపె
సబ్బు లల్లిక సుద్ద సౌందర్య వస్తువుల్
చేయింప ముడిసర్కు చెంతనిలిపె
వివిధ యుత్పత్తులన్ విక్రయింపగజేసె
యనువుగా లాభాలనందజేసె
ఇంటి పైఖర్చుల నెల్లదీయుచునాడు
చేయూతకై భర్త చెంతనిలిపె

రాగరంజితముగ నేర్చి రమణులంత
పల్లె కీర్తిని చాటిరి పరవశమున
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**78. రైస్ మిల్లు: 1963**

కుందెనలో వడ్లు కుండల కొలదిగా
దట్టించిరతివలు దంపు కొరకు
మూగి రోకళ్ళతో ముట్టడించగ వడ్లు
పొట్టు వదలుచుండె పొందికగను
ఘుప్పు ఘుప్పున దంచి గుండెలు నదురుచు
కష్టజీవి తనువు కరగుచుండె
అనునిత్యమీరీతినత్యంత శ్రమచెంది
మూల్గలరుగు వారి మూల్గు చూచె

పొట్టు నొలిపించు యంత్రమున్ పూనిదెచ్చి
తెల్లతెల్లని బియ్యము తీర్చిదిద్దె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**79. ప్రయాణ ప్రాంగణము: 1979**

పథికుల కనువైన ప్రాంగణమిటనిల్పి
విశ్రాంతి నొందించె విరివిగాను
ఎండవానల భీతినెల్లరు శీఘ్రమే
తలదాచుకొనుటకై తరలిటకు
చక్కని వంటకాల్ చౌకైన ధరలకు
నన్నివర్గాలకు నందజేసె
పరిసరాల్ నిత్యము పరిశుభ్రముగ నుంచి
ఆహ్లాద వాయువు లందజేసె

ప్రాంగణమునందు వాహనాల్ వరుసగాను
ప్రజలనెక్కించి దింపుచు పరుగజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**80. మహిళామండలి: 1975**

వనితల నానాడు పల్లెసేవను చేయ
ప్రోత్సహించెను తాను పూర్తిగాను
సర్పంచు పదవికై శాంతమ్మ నిటనిల్పి
యధికార మందించి యాదరించె
సమసమాజము గూర్చి చర్చింప మహిళల
మండలి నిర్మించి మసలజేసె
బాహ్య ప్రపంచపు పలుపోకడలనెల్ల
గమనించి నిత్యము కదలజేసె

గడపదాటిరి వనితలు గౌరవముగ
సాగజేసెను మండలి సవ్యముగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**81. గోదాములు:**

నేర్పుగా ధాన్యమ్ము నిలువ చేయుటకని
గిడ్డంగులను నిల్పె దొడ్డబుద్ధి
భీతిల్ల ప్రకృతిని పెనుమార్పులెదురైన
నిశ్చింతగా నందు నిలువ జేసె
తస్కర భయమును తప్పించి దాచుట
కనువైన చోటుల నండజూపె
వ్యాపారులెందరో భర్తి బండ్లను రోజు
తరలించి ధాన్యమున్ దాచిరిచట

దింపి యెత్తించి సంచులన్ దినము దినము
కూలి జనులకు నిత్యము కుక్షినింపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**82. పోలీసులు కన్నెత్తి చూడని పాలెము:**

రక్షక భటపాలి వీక్షణమ్ములు నాడు
ప్రసరింప లేదెప్డు పల్లెవైపు
రచ్చబండన కూర్చి రంజిల తీర్పున
కలహాలుమాన్పించి కలుపుచుండె
కక్షలన్నవి లేక లక్షణంబుగ మెల్గి
సహజీవనము చేయ సంస్కరించె
ప్రజల వృద్ధిని కోరి ప్రముఖులందరు మెచ్చ
గ్రామమున్ పాలించె గౌరవముగ

విప్రవర్యుని పౌరులు విశ్వసింప
శాంతి సౌఖ్యములందించి సాగుచుండె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**83. ఇతర గ్రామాలవారు పాలెమున స్థిరపడుట:**

గ్రామేతరులకిట గౌరవమందించి
చక్కగా స్థిరపడ సహకరించె
పల్లె గాలిని పీల్చి పరువుగా బ్రతుకను
నుద్యోగముల జూపి యుండజేసె
కక్షలు కార్పణ్య కలహాల కుంపట్లు
మచ్చుకైనను లేక మసల జేసె
చీకు చింతలనెల్ల శీఘ్రమే తొలగించి
యానంద జీవికనందజేసె

కలసి యుండిరి ప్రజలెల్ల గౌరవముగ
తీర్చిదిద్దెను పల్లెను తీరికగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**84. సత్యసాయిని రప్పించుటకై యత్నించుట:**

సత్యసాయీశు నాశ్చర్యమౌలీలలు
విశ్వమంతట నిండి వెలుగుచుండె
భక్తులెల్లరు చిత్రపటమును పూజించి
పరవశింపగ విప్రవరుడువెళ్ళి
చెన్నపట్టణమందు సేద దీరిన సాయి
చెంత నిరీక్షించి చింతనొందె
కబురందలేదని కలతగా వెనుదిర్గె
శీఘ్రమే పిలుపంది చేరి నిలిచె

పర్తి నాథుని మెప్పించి భక్తితోడ
పల్లెకరుదెంచమని కోరె పట్టుబట్టి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 85. సత్యసాయి స్పందన:

దివ్యదృష్టిని సాయి తిలకించె భూసురున్
కు(గ్రామమును మార్చు కోర్కె నెరిగె
వివిధ రంగములందు వెలుగొందజేసెడి
పట్టుదలను చూచి పరవశించె
శీఘ్రమే పల్లెను శిఖరాగ్రమున నిల్పు
సాహసబుద్ధిని స్వాగతించె
గౌరవ భారతీ కంఠహారమునందు
నాయకమణినందె నటనజూచె

తగిన కృషిసల్పు ధీరుని తపన జూచి
వలదు చింతింప నికముందు వత్తుననెను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 86. హరిజనుల గుడి ప్రవేశము:

భరతదేశమునందు హరిజనులెల్లరు
నస్పృశ్యులనుచును ననచబడిరి
దొరల దాతల గని తొలగిరి భయమున
దైవదర్శనమైన దక్కకుండె
మానవత్వముతోడ మాన్యుడు వారల
నైకమత్యము కోరి యాదరించె
కులభేదముల మాన్పి గుడిలోకి రప్పించి
కనలేని దైవమున్ కానజేసె

దైవచింతన కలిగించి ధైర్యముగను
మందిరములోన నిత్యము మసలజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**87. హరిజనుల కొరకై అరువది నూతన గృహాలను నెలకొల్పుట: 1972**

అరువది గృహముల ననువుగా నిర్మించి
హరిజనులందర కందజేసె
వస్త్రములను వంట పాత్రల నెల్లను
నుచితముగా నిచ్చె నూతనముల
పి.వి.నరసింహరావ్ పిలుపున స్పందించి
ప్రతినిధుల్ తొంబది వచ్చిరిటకు
బొట్లు బోనాలతో పురవీధులూరేగి
వేంచేయ గృహముల వేడ్క జరిపె

ఇండ్లలో వారలను నిల్పి యింపుగాను
దీనబంధుగ వెలుగొందె దెసలకంత
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**88. హరిజనులకై మాన్యాలలో ఊట బావిని త్రవ్వించుట: 1972**

హరిజనుల్ మాన్యాల వరిపంట పండించ
నూటబావిని త్రవ్వె నున్నతముగ
చుట్టూర కుడ్యము సొంపుగా నిర్మించి
నీరు తోడను యంత్రమేరుపఱచె
నేర్పుగా పొలమంత నీటిని పారించి
చక్కని పంటలన్ సాగజేసె
హర్షించిరిటనున్న హరిజనుల్ చక్కగా
జీవించిరందరున్ చింతలేక

ఆప్తుడై నిల్చి పల్లె యందాదుకొనుచు
వృద్ధినొందించె వారలన్ ప్రీతితోడ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**89. హరిజనుల జీవనోపాధికై కోళ్ళఫారములు నిర్మించుట:**

పల్లెను హరిజనుల్ పరువుగా బ్రతికింప
నాశించి ముందున కడుగలేసె
కొట్టాలు నెలకొల్పి కోళ్ళు పెంపగ జేసి
యరువది మందికి నండ జూపె
గుడ్లు బండ్లకు నింపి గుజరాతు రాష్ట్రాల
కందింపగా జేసె నాపలేక
తృప్తిగా బ్రతుకుచు వృద్ధి నొందిరిచట
చక్కని బాటలో సాగిరంత

దారిచూపుచు శ్రద్ధగా దగ్గరుండి
ప్రేమ తోడను వారలన్ పెంపుజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**90. బిచ్చోనిపల్లె (సుబ్బయ్యగూడెం)**

బుడ బుడకల సిందు బుడగజంగాలును
బవనీలు దొమ్మరుల్ బైండ్లవారు
గంగిరెద్దుల ముష్టి గంటఫకీరులు
యెరుకలి డక్కలి యెల్లవారు
చలి యెండ వానలో చతికిల బడుచును
ముండ్ల పొదలమాటు ముడుచుకొనిరి
యాచించి బ్రతుకుచు నవమానముల నొంది
కదలి సహృదయుని కంట బడిరి

తగిన గృహములన్ నిర్మించి తత్క్షణముగ
బ్రతుకుదెర్వుకై చక్కని బాట జూపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 91. విద్యాలయములు – పరిశ్రమలు:

ఆలయముల నిల్పి యలరార జేసెను
విద్యా సుగంధము వెల్లివిరిసె
పలు పరిశ్రమలను పట్టుతోడను నిల్పి
ప్రజల చేతుల నిండ పనుల జూపె
యాకలి దప్పిక యాక్రందనలు తీర్చి
శాంతి సౌఖ్యములంద సంతరించె
నలుబదివత్సరాల్ నాట్యమాడించెను
విశ్వమంతట పల్లె వెలుగజేసె

శ్రద్ధతోడను పౌరులన్ చక్కదిద్ది
ప్రజల మనిషిగ పేరొందె వసుధయందు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 92. వివిధ రంగాలలో పాలెము విద్యార్థులు:

శాస్త్ర సాంకేతిక సాహిత్య వైద్య రం
గములందు నిలిపెను ఘనుల దీర్చి
వినుతికెక్కిన విశ్వవిద్యాలయమునందు
శాఖాధిపతులను సంతరించె
ఔషధములచేత నారోగ్యమందించె
ప్రాణదాతల నంపె పల్లెనుండి
భౌతికగణితాది పలుశాస్త్రములనెల్ల
నేర్పించి బోధింపనిలువజేసె

విశ్వమంతట నిండిరి విరివిగాను
మెలగుచున్నారు నేటికి మేటిగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**93. గోబర్‌గ్యాస్:**

వనితలు వంటకై వంట చెఱ్ఱుకునువాడ
నేత్రాల పొగనిండి నీరుక్రమ్మె
మసిబారి యిండ్లన్ని మబ్బులు క్రమ్మగా
నింటిల్లిపాదుల యేడ్పుజూచె
వలపున నువిదలు వంట చేయుటకని
పొగమసియెరుగని పొయ్యిజూపె
పశువుల పేడను పదిలపర్చగ జేసి
వాయు వందించెడి వనరుజూపె

స్త్రీల చేతను పల్లెను చింతలేక
సౌఖ్యముగ వంట చేయింప సహకరించె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**94. మంచినీటి బావులు:**

సంస్థలన్నింటియందు చక్కని నూతులన్
త్రవ్వించె నీటికై తలపు కలిగి
తత్‌క్షణముగ నిల్పె రక్షణ కుడ్యాల
భయభ్రాంతులన్నిట పారద్రోలె
నుతజలరాశులు సతతము నిండుచు
తరలించనెంతేని తరగకుండె
గ్రామమందంతట గౌరవ నూతులు
గలగల యలలతో కదలుచుండె

పూడికను నూటబావుల తోడజేసి
నీటి కొరతను తీర్చెను పాటిగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**95. శ్రీమతి ఇందిరాగాంధి పాలెము సందర్శన: 1978**

హిందుదేశ ప్రధాని ఇందిరాగాంధీని
పల్లెను దర్శింప పట్టి దెచ్చె
వెంకన్న గుడిలోకి వేంచేసి రాచూలి
సాష్టాంగముగ మ్రొక్కి సంతసించె
పురమున కొందరు పూనియల్లరి చేయ
మౌనమై నాయకి మరలిపోయె
గ్రామవాసులు కొంత గాంద్రించి వారలన్
శిక్షించెద మనుచు సిద్ధపడిరి

శాంతి నెలకొల్పి పురమంత సంతసింప
మగుడి మానినీతిలకమున్ మరలదెచ్చె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**96. యతీంద్రుల సందర్శన:**

చంద్రశేఖర సరస్వతి భారతీ తీర్థ
ప్రముఖ యతీంద్రుల పాదధూళి
పల్లెనేలను సోకి పావన క్షేత్రమై
దర్శించి ప్రజలెల్ల ధన్యులైరి
పల్లెకేతెంచిన ప్రాజ్ఞురాలిందిర
దేశ ప్రధానిగా తీర్పునందె
సాగిశంకరదయాల్ శర్మగారరుదెంచి
దేశాధిపతియయి తేజరిల్లె

కంచి శృంగేరి పీఠాల గౌరతతులు
అందజేసిరి దీవెనలరుగుదెంచి
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**97. ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా స్థానము: 1969**

పరిశోధనార్థమై పల్లెను వ్యవసాయ
కేంద్రము నెలకొల్పి కీర్తి నొందె
మెలకువలెన్నియో మెదడున కెక్కించి
పాత పద్ధతులను పాతరేసె
సరిక్రొత్త విత్తనాల్ సంతరింపగ జేసి
కీర్తినొందగ జేసె పూర్తిగాను
వ్యయ ప్రయాసల నెల్ల నయముగా తగ్గించె
దిగుబడి పెంపొందె దిగులు లేక

సాదరంబుగ రైతుల నాదుకొనియె
రైతు బంధుగ వెలుగొందె రాష్ట్రమందు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**98. వ్యవసాయ విశ్వవిద్యాలయం బి.ఎస్సీ:**

పాడి పంటలపైన ప్రకృతి ప్రభావము
నధ్యయనముచేయు విద్య కొరకు
చీడపీడలనెల్ల రూఢిగా తొలగించి
పంటలదిగుబడి పరగు కొరకు
విభవుడు వ్యవసాయ విశ్వ విద్యాలయ
విజ్ఞాన కేంద్రమున్ వెలయజేసె
ఆంధ్రప్రదేశమందన్ని జిల్లాలను
విద్యార్థులరుదెంచి విజ్ఞులైరి

పల్లె దక్షిణ తెలగాణ ప్రాంతమందు
నాల్గు జిల్లాల కేంద్రమై నడపజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**99. ముఖ్యమంత్రుల సందర్శన:**

మద్రి నీలము పీవి మరి జలగము కాసు
నంజయ్య సంజీవులాది ఘనులు
సహకరింపగ పల్లె సాధించె నభివృద్ధి
యాహ్వానముల నంపె నవని సురుడు
అధినాయకులు నెల్ల హర్షించి శీఘ్రమే
దవ్వు దువ్వులనుండి తరలిరిటకు
స్వాగతమందుచు సత్కారములతోడ
జనముతో నూరంత సందడిల్లె

వేద మంత్రాలు ఘోషింప వేడ్క జరిపి
ముఖ్యమంత్రుల నెల్లను మురియజేసె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**100. ముఖ్యమంత్రుల స్పందన:**

ప్రఖ్యాతిగాంచిన ముఖ్యమంత్రులు నాటి
కాసు పీవియు మద్రి గౌర తతులు
సామాన్య విప్రుని గ్రామాభివృద్ధిని
తిలకింపనరుదెంచి తృప్తినొంది
సంస్కర్తలెల్లరు సరిరారు నీకని
సందేశమిచ్చిరి సంతసమున
నిస్వార్థ నాయకుల్ నీతీరు జిల్లాకు
ఒక్కరున్నను చాలు చక్కగాను

భరత ఖండంబు వృద్ధ్యంది మురియుననుచు
ప్రస్తుతించిరి విప్రుని ప్రముఖులెల్ల
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 101. కార్య శూరుడు

అధికారమున కెన్న డారాట పడలేదు
యాస్తి సంపాదించు ఆశలేదు
పల్లెవృద్ధికి నిల్చి పరుగిడుచుండెను
స్వార్థమై యేనాడు సాగలేదు
దేశ విదేశాల తెగ పరిశోధింప
నొనరంగ విశ్రాంతి నొందలేదు
సాహసకార్యముల్సంతరించెడివేళ
నడ్డంకులెదురైన నదురలేదు

కార్యశూరుడై నిరతము కదులుచుండె
పదవులెదురైన తృణముగా పారద్రోలె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 102. కార్య సాధకుడు

సాహసకార్యాలు సాధించె నెన్నియో
విశ్వాసమును కల్గి విడువకుండె
గ్రామరాజ్యము నిల్ప ఘననాయకుల చెంత
మనసంత కరిగించ మసలుచుండె
ప్రజలకై నిత్యము పనుల చూపించను
కంకణ బద్ధుడై కదలుచుండె
ఆహారమును నిద్ర నతిదూరముగ నుంచి
వనరుల నెలకొల్పె వైభవముగ

కార్యసాధకుడైనిల్చి కడనుదాక
మడమ త్రిప్పని వాడయ్యె మనుషులందు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**103. సుబ్బయ్య వ్యక్తిత్వము:**

మాట కఠినమైన మనసంత వెన్నయే
ప్రజల వృద్ధిని కోరి పలుకుచుండె
దారి జూపుటెగాని దండించుటకు గాదు
చక్కగా జీవింప సహకరించె
సంకోచమగు బుద్ధి సరిగ చూచిన లేదు
హృదయ వైశాల్యాన సదయుడయ్యె
ప్రాంతీయ భేదము పాటింపలేదిట
జాతీయ భావముల్సంతరించె

ముందు చూపున విప్రుడు మోదమంది
భావి పౌరులకెల్లను బాటజూపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**104. సోదరుల నిస్వార్థసేవలు:**

అనుజన్ములిరువురు ననునిత్యమును పల్లె
సేవకై నిలిచిరి చిత్తగించి
పెద్దయ్య చిన్నయ్య పేరులంతటట ప్రాకి
రామలక్ష్మణులైరి రాష్ట్రమందు
గ్రామరాజ్యముకోరి గౌరవముగనిల్ప
శ్రమచెందిరెంతయో శ్రద్ధ కలిగి
నిండైన జీవికనెనరుతో త్యాగమై
దారపోసిరి ధనదాన్యమంత

అన్న సుబ్బయ్య యడుగుల ననుసరించి
భ్రాత రామేశ్వరయ్య తావలచినడిచె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 105. శిలాఫలకాలపై సుబ్బయ్య పేరు లేకపోవుట:

గ్రామ వృద్ధిని కోరి కావించె కార్యాలు
చేతివాటముకని చేయలేదు
ఆదర్శ గ్రామమై యవతరించినగాని
యధికారమును పొంద నాశలేదు
జాతీయ నాయకుల్జతగూడి యున్నను
గర్వాంధకారము కానలేదు
ఘన శిలాఫలకాల గౌరవ విప్రుని
నామధేయము చూడ నలుసు లేదు

స్వార్థ చింతన లేనట్టి సజ్జనుండు
హృదయ ఫలకములన్ నిల్చె హృద్యముగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతి గావింతు పాలెము వేంకటేశ!

### 106. భారతదేశమునందు పాలెము స్థానము: 1965–66

సకల సౌకర్యముల్ సమకూర్చి శ్రద్ధగా
నగర జీవన రీతి నడువ జేసె
ఆధ్యాత్మికత ప్రజలాదరింపగజేసి
వెంకన్నగుడి నిల్పి వెలుగజేసె
బోగభాగ్యములిట పూర్తిగా తులతూగి
స్వర్గసీమగ పల్లె సంతరించె
అభివృద్ధి నొందిన యవని భారతియొడిన్
పంచమ గ్రామమై పరిఢవిల్లె

వినుతి కెక్కించి పల్లెను విశ్వమంత
పురుషులందున ఘన పుణ్య పురుషుడయ్యె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**107. అవసాన దశ:**

అక్షర శూన్యుల నందల మెక్కింప
నాడంబరములంది రథమ జనులు
అతిగౌరవము జూపి రవకాశమును జూచి
తిరగబడిరి కొంత తిర్రి జనులు
జీతభత్యాలకై చిత్రహింసలు బెట్టి
మోదము నొందిరి మూర్ఖజనులు
అధ్యాపకులనిట నవమాన మొందించి
మనసంత చంపిరి మందమతులు

మౌన రోగమునందియు మనసునందు
పరితపించెను పల్లెను ప్రజల కొరకు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**108. సూర్యుడు పాలెము సుబ్బయ్యను పలుకరింపనెంచుట**

ఎనుబదినాటికి నెంతయో యెదిగిన
నభివృద్ధి యానమంతాగిపోయె
శక్తి యుక్తులు మెండు చైతన్య మంతయు
శూన్యమై మనసంత స్రుక్కిపోయె
వనరులు వసతులు వరుసగా కదులుచు
దూరమై పోయెను దుఃఖమందె
దైవ నిర్ణయమేమొ దరిచేరి పురమున
సంపూర్ణ గ్రహణము సంతరించె

ప్రముఖ భూసురున్ శ్రద్ధగా పలుకరింప
భానుడరుదెంచబూనెను పాలెమునకు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 109. సూర్యుడు పాలెమును తిలకించడానికి విచ్చేయుట:

పీఠాధిపతులను పిలిపించెనిటకు పు
నీతము చేసెనీ నేలనంత
కవులు పండితులచే కలకల లాడించి
ప్రాచుర్యమొనరించె పల్లెనంత
అనతికాలముననే యభివృద్ధి సాధించి
శిఖరాగ్రమున నిల్పె చిత్తగించి
అగ్రనాయకులిట నరుదెంచి నిత్యము
సభలు సత్యారముల్ సాగుచుండె

చూడనెంచెను పాలెమున్ సుందరముగ
సూర్య దేవుడె విచ్చేసె సూటిగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

### 110. ఖగోళ శాస్త్రవేత్తలు – వారికి కల్పించిన సౌకర్యములు:

గ్రహణమున్ శోధింప ఖండాంతరము నుండి
శాస్త్రజ్ఞు లడుగిడ స్వాగతించె
చక్కని వసతులన్ సమకూర్చి శ్రద్ధగా
సౌకర్యముగనుండ సహకరించె
మండలదేశాలు మండల దినములు
తిష్టవేసిరి పల్లె నిష్టపడిరి
పర్యవేక్షణజేసి పల్లె కీర్తి పతాక
రెపరెపలాడించె రేయిపగలు

భారతావని మెడయందు భవ్యముగను
మేటి నగయయి పురమంత మెరిసిపోయె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 111. సంపూర్ణ గ్రహణము – పాలెము 18/2/1980

సమయమాసన్నమై చక్కగా సూర్యుడు
కంటికి కనరాక కదలుచుండె
పశుపక్షులెల్లను పగటి చుక్కలగని
పరుగుదీయుచు గూళ్ళ కరుగుచుండె
క్రమముగా దృశ్యము కంకణాకారమై
యగుపించె నీపల్లె నందముగను
శాస్త్రజ్ఞ బృందమా ఛాయను బంధింప
శక్తి యుక్తులనెల్ల సంతరించె

దూరదర్శిని నోటిలో త్రోసిరపుడు
నవనియంతయు తృప్తిగా హర్షమొందె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 112. అమెరికా అధ్యక్షుడైన రోనాల్డ్‌రీగను ప్రశంసాపత్రమునంపుట: 8/4/1980

మండలదినములు మనసైన వసతుల
నొందిరి శాస్త్రజ్ఞులందరిచట
ప్రముఖుడొనర్చిన వనరుల తిలకించి
హర్షించిరెల్లరునద్భుతమని
అగ్రరాజ్యాధ్యక్షునందెను వార్తలు
రోనాల్డు రీగను రూఢిగాను
శీఘ్రమే స్పందించి సేవల కొనియాడి
యభినందనల పత్రమందజేసె

శాస్త్ర సంచిక ముఖముపై చక్కగాను
గ్రహణచిత్రమ్ము ముద్రించి గౌరవించె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**113. సుబ్బయ్య గారు అస్తమించుట: 23/6/1986**

కారణ జన్ముడు కర్తవ్యములనెల్ల
పరిసమాప్తము జేసె పల్లెయందు
ఉదయభానుని కాంచి ముదముతో వేడెను
స్వాగతింపుమనుచు స్వర్గమునకు
హృద్రోగ నిపుణుని కృషికి తా హర్షించి
ప్రాణమున్ రక్షించు పరుగునాపె
ఆసన్నమయ్యె నా కస్తమించుటకని
సోదరున్ పిలిపించి సూచనలిడె

ప్రాణసమమైన మనవూరు పాలెమందు
దహనమొనరింపు మనికోరె తనదు తనువు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**114. దైవమును ప్రశ్నించుట:**

కాంక్షించి యేమైన కలహించెనా! స్వామి
సురలోకముననంతు చూతుననెన?
న్యాయమా నీకిది నరలోక పూజ్యుని
కరుణించి దీవించి కావలేక
కీర్తియందు ఘనుని గెలువలేనని తల్చి
ప్రాణము కొనిపోవ పాడికాదు
అందించి దయను మాయయ్యను మరలనీ
వుద్భవింపగజేయు మూరియందు

పూర్వ వైభవమందించ పూనుటకును
స్వార్థరహితమైమమ్మెల్ల సాకుటకును
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతి గావింతు పాలెము వేంకటేశ!

**115. సుబ్బయ్యగారి మహా ప్రస్థానము:**

శ్రద్ధగా చదువులు సాగించుకోసమై
భారతీ నిలయాల పాదుకొలిపె
భక్తి పెంపొందింపభగవంతునిట నిల్పి
నారోగ్యకేంద్రములందజేసె
వ్యవసాయమున ఘన పరిశోధనలు చేయ
ప్రాంతీయ కేంద్రమున్ పట్టి నిలిపె
పలుపరిశ్రమలను పల్లెను నెలకొల్పి
చక్కగా జీవింప సహకరించె

విశ్వమంతట కీర్తితో వెలిగిపోయి
పాలెమున మూర్తియైనిల్చె పాటిగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**116. రాష్ట్ర గవర్నర్ కుముద్‌బెన్ జోషిచే సుబ్బయ్యగారి విగ్రహావిష్కరణ:**

ఆంధ్ర రాష్ట్ర గవర్నరధికారియగుజోషి 22/6/1987
మహనీయు సేవలు మనసుదొలిచి
నిస్వార్థనాయకు నిజరూపమును తాను
వీక్షింపగను కోరి వేచియుండె
తనువుచాలించిన ధన్యుని సుందర
కాంస్య విగ్రహమును కాంచె తుదకు
భూసురు విజయాల పూర్తిగా తిలకించి
పూజ్య హృదయమంత పొంగిపోయె

క్షేత్ర తీర్థములొసగెడి క్షేమములిట
పొందవచ్చని నుడివెను పొందికగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**117. దేవతలాశీస్సులందించుట:**

విశ్వవిహారులై విహరించు యమరుల
దృష్టి సోకగ పల్లె తేజరిల్లె
కాంస్య విగ్రహమిట కాంతులీనగ కాంచి
వింతగా వేల్పులు వివశులైరి
చిత్రగుప్తుని పుటల్ శీఘ్రమే శోధించి
రాశ్చర్యమును పొంది రమరులంత
భూసురోత్తములందు పుణ్య కీర్తనుడని
దీవెన లొసగిరి దివిజులెల్ల

సురల హృదయము గెలిచెను సొగసుగాను
అమరజీవియై నిలిచినాడవనియందు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**118. వివిధ వర్గాలకు బంధువుగా పేరుగాంచుట:**

విద్యాభివృద్ధికై విరివిగా కృషిసల్పి
విజ్ఞాన బంధువై వినుతికెక్కె
వ్యవసాయ రంగమున్ పరిఢవిల్లగ జేసి
రైతుబంధుగ వెల్గె రాష్ట్రమందు
కష్టాల కడలిని కరుణించి దాటించి
యాపద బంధుగ నండనిలిచె
రోగాల నెన్నియో రూఢిగా తొలగించి
ఆత్మబంధుగ పల్లెనాదరించె

దీనులను దరిచేర్చిన దీనబంధు
భక్తి పెంపొంద జేసిన భక్త బంధు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**119. సుబ్బయ్య అనేక రూపాలలో కనిపించుట:**

ఆర్థుల దృష్టికి అన్ని కోర్కెలు తీర్చు
కల్పవృక్షముగాను కానబడియె
దుర్మార్గ చిత్తులు తొలగిరి భయమున
కాలుడై తోచగా కనుల ముందు
అన్నార్థులగువారు అక్కున చేరిరి
యక్షయ పాత్రగా నరసి జూసి
అజ్ఞానము తరిమి సుజ్ఞానమొసగెడి
జ్ఞాన భాండమని విజ్ఞానులనిరి

వివిధ రూపాల విభువని విశ్వసించి
బ్రతుక నరుదెంచిరెందరో పల్లెయందు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**120. ధృవతారగా నిలిచిన సుబ్బయ్య గారు:**

వడ్డికాసులవాడు వరుడు సుబ్బయ్యగా
నుద్భవించెను పల్లెనున్నతముగ
దెసలలో నెలకొన్న దీనులన్ దరిచేర్చి
కష్టనష్టాలను కదల జేసె
విలువగా బ్రతికించి విఖ్యాతి నొందించి
సామాన్యుడైయుండె సాటిలేక
ధృవతారగా తాను దిక్కులంతట వెల్గి
శిల్ప రూపము దాల్చె శ్రేష్ఠముగను

ప్రజల హృదయాలలో నిల్చి నిజముగాను
పూజలందెను దైవమై పుడమియందు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**121. తోటపల్లి వంశజులకు మోక్ష ప్రాప్తిని కలిగించుట:**

తన వంశకీర్తిని ధరపైన నిలుపను
నడుగు ముందునకేసె నవనిసురుడు
ఏడేడు తరముల వేడుకన్ భువిపైన
వెలుగొంద జేసెను విలువగాను
ప్రజలలోనైక్యమై పలు సమస్యలపైన
పోరాటములుసల్పి పూర్తిగాను
విజయాలు సాధించి విజయుడై వెలుగొంది
అమరుడై నిలిచె నీయవనియందు

తోటపల్లి వంశజులకు త్రోవజూపి
మోక్షప్రాప్తిని కలిగించె మోదముగను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**122. గ్రామాభివృద్ధికై సహకరించిన దాతలు:**

ధర్మాత్ములైనట్టి దాతలు కొందరు
గ్రామాభివృద్ధికై కదలివచ్చి
చక్కనాలోచనల్ సాగించి సజ్జనున్
ప్రోత్సహించిరినాడు పూర్తిగాను
అడుగుముందుకువేసి యభివృద్ధి సాధించి
హర్షింప జేసెనీ యవని సురుడు
చిరకాలమెల్లరు స్మరణలోనిలిచిరి
ప్రజల హృదయమందు పదిలమగుచు

స్వార్థరహితుల సేవలు శాశ్వతములు
తగిన సభలలో స్తుతులైరి తప్పకుండ
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 123. డా॥ పాపిశెట్టి గోపాలు గారు

పట్టాను చేబూని పల్లెకేతెంచెను
దీక్షగా ఋణమును తీర్చుకొనెను
చక్కని నగరము స్వాగతించిన గాని
సంతోషముగనిట సర్దుకొనెను
సంతానమును నిల్పు శస్త్ర చికిత్సలన్
గౌరవమును పొందె గ్రామమందు
శ్రద్ధగా నిత్యము సామాన్య జనులకై
ప్రాణాలు రక్షింప పాటుపడెను

పాపిశెట్టి గోపాలుగారోపికగను
సేవచేయను బోధించి చెంత నిలిపె
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 124. పాలెము పూర్వ విద్యార్థులు - బాలకిష్టయ్య, మోహన్‌బాబులు

బహుకృతజ్ఞతయున్న బాలకిష్టయ్యాది
మోహనుబాబును పుణ్యకాంక్ష
చదువుసంధ్యలు నేర్పిచక్కని కొలువులన్
స్థిరపడచేసిన వరుడుయనుచు
సుకృతుని సేవలన్ సొగసుగా మది నిల్పి
ప్రేమతో నేటేట నీమముగను
జన్మ వర్ధంతులన్ సంతోషముగజర్పి
ఋణము దీర్చుకొనగ తృప్తిగాను

ఆలుపిల్లలు పల్లెకు నరుగుదెంచి
ధన్యవాదములొనరించి తరలుచుండ్రు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 125. ఈనాటి గ్రామ పరిస్థితి

స్వార్థచింతనయున్న సర్పంచు లీనాడు
గుంజెత్తు పని సమకూర్చలేదు
మైకు చేతనుబూని మాన్యుని స్మరియించి
ఉత్తుత్తి పలుకుల నూదుకొనుచు
చప్పట్ల దుప్పట్ల సన్మానములనొంది
తబ్బిబ్బులౌచును తరలుకొనుచు
కూర్చిన వనరులన్ కూల్చి నేర్పున తమ
జేబులు నింపిరి చిత్రముగను

ఉన్న సంస్థల కాపాడ నోపలేరు
వృద్ధి నొందింపగను చిత్త శుద్ధి లేదు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

## 126. గత స్మృతులు

మిడిమిడి జ్ఞానులు మిడిసిపాటుల వారు
గ్రామాధిపతులుగా గర్వపడిరి
స్పర్థలన్ సృష్టించి శ్రద్ధగా స్పందించి
ప్రజల మెప్పును పొంద పరుగులిడిరి
పగల నిప్పులు రేపి ప్రజ్వలింపగనేడు
పురమంత వ్యాపించి పొగలు క్రమ్మె
ఊపిరాడక కొందరుండ వీలునుగాక
నగరవాసమువైపునడుగులిడిరి

స్మృతిని పాలన జ్ఞప్తియై తృప్తిగాను
నెమరు వేసిరి విజ్ఞులు నిజము నిజము
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**127. సుబ్బయ్యను తిరిగి పుట్టమని ప్రార్థించుట:**

రావయ్య సుబ్బయ్య రక్షింప ప్రజలకై
ఉద్భవింపుము మళ్ళి యూరియందె
నిరుపేదలకునెల్ల నిస్వార్థముగ సేవ
లందించి యభివృద్ధి నందజేయ
నీతీరు సేవకుల్ నేలపై వెదికిన
కనిపించ రెంతటి ఘనులునైన
అధికారదాహులు స్వార్థచింతన కల్గి
నిలువెల్ల విషముతో నిలిచిరిపుడు

హృదయ హారతు లందింప తృప్తిగాను
వెదుకు చున్నారు నినుకోరి విరివిగాను
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

**128. కవి సందేశము:**

సుబ్బయ్య సుగుణాలు సొగసుగా వర్ణించి
గోవర్ధనాఖ్యుడన్ గొప్పగాను
వెంకన్న పేరున వెలయించితి కృతిని
ప్రజలాదరింపను పాటిగాను
శ్రద్ధగా చదివిన శ్రవణ మందినగాని
చక్కని సుగుణాలు చిక్కి నిలుచు
నిస్వార్థ సేవలన్ నేర్పుగా నొనరించ
బుద్ధి పుట్టించును పూర్తిగాను

కనుడు జనులార పాలెము ఇనుని చరిత
తారయై వెల్గుచున్నాడు ధరణి యందు
ఘనతగాంచిన సుబ్బయ్య గ్రామ సేవ
వినుతిగావింతు పాలెము వేంకటేశ!

# ప్రోత్సాహక ప్రశస్తి

**1. శ్రీ ములుకుట్ల రామకృష్ణ శాస్త్రి - శ్రీమతి సరస్వతమ్మ గారలు:**

ములుకుట్ల శాస్త్రి శ్రీమతి
పలువిధముల వెన్నుతట్టి పదపదమనుచున్
తలపున నిలిచిరి ఘనముగ
అలుపెరుగని సూచనలిడిరాదంపతులున్

చదువులునబ్బుట కొరకని
నుదయించినదాది మమ్ము నుచితమ్ముగ తా
మదురును బెదురును లేక స
హృదయముతో చేరదీసి రింపుగ నేర్పన్

చిల్లర బ్రతుకులు వలదని
చల్లగ మారామకృష్ణశాస్త్రులు నుడివెన్
మెల్లగ మార్పును దెచ్చుచు
తల్లిగ నిల్చెను సరస్వతమ్మయు మాకున్

**2. డా॥ శ్రీరంగాచార్యులవారు:**

శ్రీరంగాచార్యుల నే
నారాధించుదు నిరతము నానందముగాన్
మారగజేసెను మనసును
గారవముగ పద్యములెడ గంతులువేయన్

**3. శ్రీ సీతారామ శాస్త్రి గారు**

సీతారామయ్యనెపుడు
ప్రాత:కాలంబునందు ప్రార్థన చేతుమ్
ప్రీతిగ మము దరిచేర్చెను
నీతిని బోధించువిద్య నేర్వగజేసెన్

**4. డా॥ గోపాలకృష్ణరావు గారు**

గోపాలకృష్ణ వర్యుడు
కాపాడెను గణితమందు కరములు మోడ్తున్
యేపారుత్తీర్ణతకై
సోపానములేసితీర్చె సొంపుగనన్నున్

**5. శ్రీమర్యాద బాల్‌రెడ్డి గారు:**

మర్యాద బాలరెడ్డీ
పర్వుగ నావెన్నుతట్టె పద్యములల్లన్
వెర్వక వెన్నంటి నిలిచి
మర్వక వ్రాయించె పల్లె మాన్యుని చరితన్

**6. శ్రీ గోవిందు మడేలు గారు:**

పద్దెము లల్లుచు చదువగ
నిద్దుర పోవుచు మడేలు నేర్పుగ వినుచున్
ముద్దుగ నున్నవి చాలని
ముద్దెర వేసెను గులుగుచు మురిపము నందన్

**7. శ్రీ సొప్పరి నరసింహ గారు**

అప్పటి పాలెము చరితను
సొప్పరి నరసింహ నాకు సొంపుగ నుడివెన్
గొప్పగ శతకము నల్లితి
తప్పక కీర్తింపబడును ధరపై నెపుడున్

**8. శ్రీ పర్కాల రమేశ్ గారు**

భౌతిక కాయము భవబంధనములతో
స్వార్థ చింతన కల్గి సాగుననెను
నీటి బుడగవంటి నిలువని తనువిది
వరమైన జీవిక వ్యర్థమనెను
శాశ్వత కీర్తికై సాహసించుమనుచు
సలహాల నందించె చక్కగాను
గ్రామాభివృద్ధికై కదలిన సుబ్బయ్య
చరితనల్లను కోరి సాగుమనెను

స్మరణకందని విషయాలు మదికి దెచ్చి
ప్రోత్సహించెను శతకమై పూర్తిగాను
హృదయముప్పొంగె భావాల తృప్తిగాను
తెలిపి పర్కాల రామేశు తీరికగను

**9. నాటి భవన నిర్మాణ శ్రామికులు:**

సీ॥ శక్తి యుక్తులతోడ శ్రమ చెందిరెందరో భవనాలు నిర్మింప భక్తి కలిగి
గుణపాల నాడించి గోతులన్ ద్రవ్విరి చెమటబిందువులెల్ల చిందజేసి
రాళ్ళురప్పలు పెల్లలుల్లాసముగనెత్తి బుజబలుల్ పోరాడు గజములైరి
ఇసుక సున్నపు నీట జిగటమిశ్రమమందు బలమైన దున్నలన్ బంతి ద్రిప్పి

తే॥ గచ్చు చేసిరి దుడ్డెలు నిచ్చగించి
చక్కనైనట్టి కట్టడాల్ సాగజేసి
సహకరించిరి శ్రామికుల్ శ్రద్ధకలిగి
మేస్త్రి **దేవిడు** యందులో మేటిపరుడు

**10. ఈనాటి భవన నిర్మాణ శ్రామికులు:**

సీ॥ ఆనాటి కట్టడాలీనాటికైనను చెక్కుచెదరలేదు శ్రేష్ఠములయి
చిత్త శుద్ధులు నాడు విత్తమార్జనకని నయవంచనలతోడ నడవలేదు
నైపుణ్యవంతులై న్యాయమార్గములందు శ్రమ చెందిరెంతయో శ్రద్ధకలిగి
కీర్తి సౌధములందు పూర్తిగా నెలకొని వెలుగొందిరెల్లరు విలువగాను

తే॥ స్వార్థ బుద్ధులు ఈనాడు వ్యర్థముగను
లోపములతోడ పనుల ప్రలోభులగుచు
మరుగు పుచ్చుచు పైపైన మెరుగులద్ది
దండుచున్నారు డబ్బును దండిగాను.




పాలెం పూర్వ విద్యార్థి సంఘము

సీ॥ పల్లె సంస్థలయందు ప్రముఖ విద్యలనొంది జాతి రత్నములయి జగతినిండి
వివిధ రంగములందు విజ్ఞానకాంతులన్ వెదజల్లి కీర్తితో వెలిగిపోయి
మార్గనిర్దేశకున్ స్మరియింపగను పూర్వ విద్యార్థి సంఘమున్ వెలయ జేసి
హృదయ హారతులెల్ల తృప్తిగా నర్పింప నేటేట మరువక నేకమయ్యి

తే॥ అమరుడైనట్టి సుబ్బయ్య నాత్మదలచి
గతము నెమరేసి తమరెల్ల గౌరవముగ
చాటుచున్నారు పాలెము చరితనెపుడు
స్వీకరింపుడు మానుతల్ చిత్తగించి.




30 పడకల ఆసుపత్రి (ప.17)




పశువుల ఆసుపత్రి (ప.20)



పూర్వ విద్యార్థుల వసతి గృహము (ప.24)



కళాశాలలో యన్.సి.సి. (ప.56)



సినిమా హాలు (ప.57)



శారదాదేవి విగ్రహము, అధ్యాపక విద్యార్థి బృందం (ప.59)



గ్రామీణ మంచినీటి సరఫరా (ప.65)




తంతి తపాలా కార్యాలయములు (ప.67)




దూరవాణి కేంద్రము (ప.69)




యూనియన్ బ్యాంక్ (ప.68)



రైస్‌మిల్లు (ప.78)



ప్రయాణ ప్రాంగణము (ప.79)



హరిజన మాణ్యాలలో నిర్మించిన
పెద్ద రాళ్ళ బావి (ప.88)



బిచ్చోనిపల్లి (ప.90)



దక్షిణ తెలంగాణ వ్యవసాయ
పరిశోధనా కేంద్రము (ప.97)



పాలెంలో సంపూర్ణ సూర్యగ్రహణము (ప.111)



నేడు పూడ్చబడిన నాటి నల్లాల బావి (ప.125)



ఆనాటి ప్రాథమిక ఆరోగ్య కేంద్రము
(నేటి జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల)
స్వార్థపరులచే ప్లాట్లకొరకై
కూల్చబడిన ప్రహరీ గోడ (ప.125)

సుబ్బయ్యగారు నిర్మించిన సంస్థల శిలాఫలకాలలో కొన్ని (ప.105)




























సుబ్బయ్యగారు నిర్మించిన సంస్థల శిలాఫలకాలలో కొన్ని (ప.105)

































ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి పాలెము దేవాలయ సందర్శన





డా॥ కె.రాంచందర్‌రావు
వెటర్నరి



శ్రీ కె.రాంచంద్రారెడ్డి



శ్రీ కె.జనార్ధన్‌రెడ్డి

## శ్రీవేంకటేశ్వర ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, పాలెం, అధ్యాపక బృందం


శ్రీ నాగేశ్వరరావు, ప్రిన్సిపల్


శ్రీ దాతాశరణ్


శ్రీ పార్థేశ్వరరావు


డా॥ఎస్.లక్ష్మీనారాయణ


శ్రీ హరేంద్రబాబు


శ్రీ కె.ఎస్.లక్ష్మా రెడ్డి


శ్రీ కె.ఎస్.పాప్


శ్రీ కె.సీతారామయ్య


శ్రీ కె.సుబ్బారావు


శ్రీ ఎ.వి.రామచంద్రమూర్తి


శ్రీ కనకరాజు


శ్రీ వి.దుర్గాప్రసాద్

## శ్రీవేంకటేశ్వర ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, పాలెం, అధ్యాపక బృందం



శ్రీ కె.ఎస్.ఆర్.రమేశ్



శ్రీ యం.రామకృష్ణ



శ్రీ యం.వి.తిమ్మయ్య గుప్త



శ్రీ యం. నాగరాజు



శ్రీ టి.వేంకటరామ రెడ్డి



శ్రీ బి.కేశవాచారి



శ్రీ పి.నారాయణ రెడ్డి



శ్రీ కేశవ స్వామి

## ఆదర్శ ఉన్నత పాఠశాల, పాలెం, ఉపాధ్యాయ బృందం


శ్రీ జి.రాములు


శ్రీ ఎస్.వెంకయ్య


శ్రీ కె.జగన్నాథరెడ్డి


శ్రీ కెం.యం.రాంరెడ్డి


శ్రీ వి.ప్రతాప్ రంరెడ్డి


శ్రీ యన్.కొండారెడ్డి


శ్రీ ఆర్.శేఖర్


శ్రీ జి.గోపాల్‌రావు


శ్రీ యన్.మాధవరావు


శ్రీ కె.సాంబశివరావు


శ్రీ పి.బాల్‌రెడ్డి


శ్రీ వి.రాజయ్య


శ్రీ యన్.భుజంగరావు


శ్రీ యం.డి.దర్వేశలి


శ్రీ జి.చంద్రమౌళి


శ్రీ వెంకటరమణ


శ్రీ వి.సత్యనారాయణ


శ్రీ బి.స్లీవమ్మ


శ్రీ యమ్.సరస్వతమ్మ


శ్రీ యమ్.మల్లారెడ్డి

# శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, పాలెం అధ్యాపక బృందం


శ్రీ తెలకపల్లె విశ్వనాథ శర్మ


శ్రీ వింజమూరి శేషఫణి శర్మ


శ్రీ యం.రామకృష్ణ శాస్త్రి


శ్రీ మామిడేల సీతారామ శాస్త్రి


డా॥ శ్రీరంగాచార్యులు


శ్రీ మామిడన్న సత్యనారాయణ


శ్రీ వి.వి.ఆర్.పతంజలి


డా॥ కపిలవాయి లింగమూర్తి




సామాన్య ప్రజల ప్రాణాలు రక్షించుచున్న

**డాక్టర్ పి.గోపాల్ గారు**



శ్రీ మనుసాని రామలింగయ్యగారి తృతీయ పుత్రుడు,
శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయ వంశపారంపర్య దర్మకర్త
శ్రీ మనుసాని నరసింహ్మస్వామి గుప్త, వారి ధర్మపత్ని శ్రీమతి పుష్పావతమ్మ.



శ్రీ గంధం భీమయ్య గారి ధర్మపత్ని శ్రీమతి భారతమ్మ, వారి కుటుంబ సభ్యులు



**శ్రీ నారాయణ రెడ్డి** రిటైర్డ్ లెక్చరర్
**శ్రీమతి హనుమమ్మ**



**శ్రీ రామచంద్రమూర్తి** రిటైర్డ్ లెక్చరర్,
**శ్రీమతి విజయలక్ష్మి** రిటైర్డ్ టీచర్



**శ్రీ ఎస్.బాలకిష్టయ్య** రిటైర్డ్ డైట్‌లెక్చరర్,
**శ్రీమతి శారదమ్మ** రిటైర్డ్ టీచర్



**శ్రీ కె.సుదర్శనాచార్యులు** రిటైర్డ్ టీచర్
**శ్రీమతి జానకమ్మ** రిటైర్డ్ టీచర్



**శ్రీ జంగం శ్రీనివాసులు**
ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్
**శ్రీమతి సరస్వతమ్మ** ఎంపి.టి.సి.,



**శ్రీ కె.రాంచంద్రారెడ్డి, వారి శ్రీమతి**



**శ్రీ జి.బ్రహ్మచారి,** జ్ఞానవికాస భారతి అధ్యక్షులు
**వారి శ్రీమతి**



**ఆర్.వెంకటరాములు** ఆర్.ఎం.పి.
**శ్రీమతి శ్రీదేవి**



**డా॥ డి.ఎస్.ఆర్.రాజేందర్ సింగ్,డి.సునిత**
ప్రధానాచార్యులు, పాలమూరు
విశ్వవిద్యాలయ పాలకమండలి సభ్యులు



**శ్రీ ఎస్.కె.ఇస్మాయిల్** పిజిటి
**శ్రీమతి ఎస్.కె.బషీరున్నీసాబేగం**
డి.ఎల్., రసాయణ శాస్త్రం



**శ్రీ మహమ్మద్ జహీరుద్దీన్,** ఎస్.ఆర్.
**శ్రీమతి రుక్సానా బాను** డి.ఎల్., జువాలజీ



**శ్రీ ఆర్.రాజశేఖర్ రెడ్డి** టీచర్
**శ్రీమతి కె.మంజుల,** డి.ఎల్., ఫిజిక్స్



**శ్రీ బి.విశ్వనాథ్** జూనియర్ అసిస్టెంట్
**శ్రీమతి సి.హెచ్.రవళి** డి.ఎల్., గణితము



**డా॥ వి.సురేశ్ బాబు** టీచర్
**శ్రీమతి కె.సుష్మ,** డి.ఎల్., ఎకనామిక్స్



**శ్రీ నాగేంద్రప్రసాద్** టీచర్
**శ్రీమతి జె.జ్యోతి** డి.ఎల్., పొలిటికల్‌సైన్స్



**శ్రీమతి స్వాతి** డి.ఎల్.,బాటని
**శ్రీశివరాంపసాద్** సాఫ్ట్‌వేర్ ఇంజనీర్



**శ్రీ బి.లక్ష్మణ్,** డి.ఎల్., ఇంగ్లీషు
**శ్రీమతి స్వప్న**



**శ్రీ పి.ధర్మ** డి.ఎల్.
**శ్రీమతి నాగమణి**



**శ్రీ జి.శ్రీనివాసులు,** డి.ఎల్.
**శ్రీమతి లక్ష్మి**



**శ్రీ జి.యాదగిరి,** జూనియర్ అసిస్టెంట్
**శ్రీమతి రేణుకాదేవి**



**శ్రీ మధుసూదన్ శర్మ** ప్రిన్సిపాల్
**శ్రీమతి నిర్మల,** టీచర్



**శ్రీ ఎల్.కోదండరాములు,** డి.ఎల్.
**శ్రీమతి శశికళ,** టీచర్



**శ్రీమతి హెచ్.5మంజుల** ఆర్.ఐ.
**శ్రీ హెచ్. మల్లేష్** డి.ఎల్., రసాయణశాస్త్రం



**శ్రీ ఇమ్మానియల్** డి.ఎల్.,
**శ్రీమతి సంతోషమ్మ**



శ్రీ కె.గోవర్ధన్ డి.ఎల్.



శ్రీ ఎ.రవిశంకర్ జె.ఎల్



శ్రీ ఆర్.దేవేందర్, టీచర్
శ్రీమతి పద్మజ



శ్రీ కె.వీరయ్యశెట్టి పౌల్ట్రి ఫార్మర్
శ్రీమతి ప్రసన్న లక్ష్మి



శ్రీ రామకృష్ణ, డి.ఎల్.



శ్రీ యం.మద్దిలేటి, డి.ఎల్.



కుమారి సుజాత



శ్రీ కె.బాలకృష్ణ, శ్రీమతి లక్ష్మి, వ్యవసాయం



శ్రీ జి.శ్రీనివాసులు, మెకానిక్
శ్రీమతి లక్ష్మి





**శ్రీమతి అరుణ**
**శ్రీ రాఘవేందర్‌రావు,** ప్రిన్సిపాల్

**శ్రీ వేంకటప్రసాద్,** డి.ఎల్.



**శ్రీ రమేశ్,** గెస్ట్ లెక్చరర్



**శ్రీ వి.రవి,** టీచర్



**శ్రీ పి.సింగోటం,** పాట్రీ



**శ్రీ నర్సింహులు,** జె.ఎల్.



**శ్రీ యం.బాల్‌రెడ్డి,**
రిటైర్డ్ అసిస్టెంట్ లైబ్రేరియన్



**శ్రీ ఎద్దుల రాములు,** ఎం.పి.పి.
**శ్రీమతి రాములమ్మ**



**శ్రీ జి.కిరణ్,** టి.ఆర్.ఎస్. మండలాధ్యక్షులు
**శ్రీమతి జి.స్వాతి**



శ్రీ జి.శ్రీనివాసులు మరియు వారి కుటుంబ సభ్యులు



శ్రీ జి.జానకిరాములు మరియు వారి కుటుంబ సభ్యులు



శ్రీ జి.పురుషోత్తం, శ్రీమతి జి.లీల



శ్రీ జి.తిరుపతయ్య, శ్రీమతి శ్రీదేవి



శ్రీ జి.బాష, శ్రీమతి బక్కమ్మ



శ్రీ జి.నారాయణ, శ్రీమతి చెన్నమ్మ



ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, నాగర్‌కర్నూల్, అధ్యాపక బృందం



ప్రభుత్వ పురుషుల డిగ్రీ కళాశాల, నాగర్‌కర్నూల్, అధ్యాపక బృందం



చి॥ గోవిందు చంద్రశేఖర్



శ్రీమతి శాంతమ్మ

పాలెము గ్రామ మొదటి మహిళా సర్పంచ్

## గ్రామ సమాచారాన్ని అందించి ప్రోత్సహించినవారు


శ్రీ సొప్పరి నరసింహ


శ్రీ బోనాసి బక్కన్న


శ్రీ పాండు


శ్రీ గోవిందు మడేలు


శ్రీ వర్కాల రమేశ్


శ్రీ వెలుగు లక్ష్మయ్య


శ్రీ సొప్పరి బాలస్వామి (పాలెం మేస్త్రి సంఘం అధ్యక్షుడు)
శ్రీమతి చిట్టెమ్మ మరియు కుటుంబ సభ్యులు




## గౌ॥ జి. కొండమ్మ గారి విద్యాభ్యాసము

బాల్యమందేనాడు బడిబాట నెరుగదు
అక్షరాలను నేర్చె లక్షణముగ
తమ్ముడౌ శ్రీనివాస్ తన చెంత కూర్చుండి
పదములన్ పలికించె ముదముతోడ
ప్రాచ్య కళాశాల పంతుల్లు సదయులై
చదువుల యొడిలోన సరిగ నిలుప
కులవృత్తి వీడక కోర్కెతో నిత్యము
శ్రద్ధగా పఠియించె రాత్రి పగలు

అమ్మనాన్నల యాశీస్సులందుకొనెను
ప్రోత్సహించిరి గురువులు పూర్తిగాను
దీపకాంతికి కృషి సల్పి దీక్షబూని
పంతులమ్మయై కొండమ్మ మన్ననందె



# గురువుల ఆశీర్వచనాలు
# కృతికర్త కృతజ్ఞతలు

సీ॥ జ్ఞానకోవిదులైన నాటి పండితకవుల్ చేరదీసిరి నన్ను చిత్తగించి
శతకమున్ పరికించి సలహాల నందించి పీఠికల్ వ్రాసిరి ప్రేమతోడ
ఆశీస్సులొసగిరి యభివృద్ధినొందను సాహిత్య సేవకై శాశ్వతముగ
స్వీకరించితి వారి శ్రేష్ఠమౌవచనాలు తలదాల్చినడుతును తప్పకుండ

తే॥ సరిగ సాహితీరంగాన సాగునటుల
ఊహకందించి విషయాల నున్నతముగ
నాదు నాల్కపై నిత్యము నాట్యమాడ
వేడుకొంటిని భారతిన్ విశ్వసించి

–గోవిందు గోవర్ధన్